Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

102828

# గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ శ్రావణ బ॥ ౮ (౨౬-౧౧-౧౩౪౯ ఫ.) సోమవారము సంచిక ౩౩

★ ఆత్మస్వాతంత్ర్య రక్షణకై ఈజిప్టుపోరాటపు నిశ్చయము ★

★ జపాను విదేశాంగ విధానములో మార్పు ★

# రుమేనియా రాజ్య విచ్ఛేదము

## బల్గేరియాకు డోబ్రుజా ప్రదానము

### హంగరీతో సంభాషణలు తెగలేదు

రుమేనియా ప్రతినిధులు బల్గేరియా ప్రతినిధులతోను, హంగరీప్రతినిధులతోను సంభాషణలను అగస్టు ౧౬ వ తేది ఉదయమునుండి సాగించిరి హంగరీప్రతినిధులు రుమేనియాప్రతినిధులకు కొన్నిసూచనలను చేయగా, హంగరీప్రతినిధులు వాటివిషయములో ఆలోచనకు అవకాశము కోరుటచే అంతటితో సభచాలించి తిరిగి రాత్రి ౧౦ గంటల ప్రాంతములో ప్రారంభించిరి. హంగరీప్రభుత్వసూచనలకును రుమేనియాసూచనలకు చాలవారతముండినను, హంగరీప్రభుత్వమువారు తమప్రతినిధులను సంభాషణలను సాగించుచుండవలసినదనిరి, అందుచే సంభాషణలు మరలసాగించబడెను. ఈ సంభాషణలలో తేలిన హంగరీ, రుమేనియాల అభిప్రాయములను ఆ రెండుదేశాలప్రతినిధులు తమతమప్రభుత్వములకు తెలియజేయుట కంగీకరించిరి అందుచే హంగరీప్రతినిధుల నాయకుడగు హోరీగారు ఆరాత్రియే తమదేశానికి ప్రయాణమైరి, అక్కడ తమ ప్రభుత్వమువారి అభిప్రాయాన్ని కనుక్కొని తిరిగి అగస్టు ౨౧ వ తేదినాటికి టూర్నుస్ సెరినుకు చేరిరి. అక్కడ రుమేనియా ప్రతినిధులతో సంభాషణలు తిరిగిసాగించుటకు ప్రారంభించిరి. సంభాషణలు జరుగుచున్నకొలది భేదములుఎక్కువయగుచున్నవి. ఇపుడు జర్మనీప్రభుత్వమువారు వచ్చి మధ్యవర్తిత్వము చేసినకేగాని వివాదము పరిష్కారము కానట్లు కనిపించుచున్నది.

బల్గేరియా

బల్గేరియా ప్రతినిధులతో సంభాషణలఫలితముగా రుమేనియా డోబ్రుజాలో దక్షిణభాగమును బల్గేరియాకు ఇచ్చివేయుటకు అంగీకరించినట్లు గతసంచికలోనే సూచించియుంటిమి. అగస్టు ౧౯ వ తేదినాడు మధ్యాహ్నము బల్గేరియాలోని రుమేనియనులను రుమేనియాకును, రుమేనియాలోని బల్గేరియనులను బల్గేరియాకును మార్పించువిషయమును, అట్లుమార్పించునపుడు రుమేనియాలో బల్గేరియనులు వదలవలసిన ఆస్తులకును, బల్గేరియాలో రుమేనియనులు వదలవలసిన ఆస్తులకును పరిహారమునిచ్చువిషయమునను ఆలోచనలు సాగించబడినవి

అగస్టు ౨౧ వ తేదినాటికి బల్గేరియా రుమేనియాలమధ్య సరిహద్దును ౧౯౧౨ సం॥ స్థానములో ఏర్పాటుచేసికొనుటకు పరస్పరాంగీకారము కుదిరెను. ఇట్లు బల్గేరియాకిచ్చుట కంగీకరించిన ప్రదేశములో దుర్యొస్టరు, కాలియాక్రా అను రెండురాష్ట్రములు చేరియున్నవి.

ఇపుడు రెండురాజ్యముల ప్రజలను స్వదేశములకు మార్పించువిషయమై సంభాషణలింకను సాగుచున్నవి. బల్గేరియా ప్రభుత్వమువారు ప్రజలను మార్పించుటకు అంగీకరించుచున్నారుగాని, నష్టపరిహారము నిచ్చుటకు ఏమాత్రము అంగీకరించుటలేదు ఈ చిక్కుమాత్రము యిపుడు మిగిలియున్నది

ఈ లోగా బల్గేరియా సేనలు ఒడంబడికపత్రముపై తుదిసంతకములు చేయబడినవెంటనే డోబ్రుజా దక్షిణభాగములో తమకీయబడిన ఈరెండు రాష్ట్రములను ఆక్రమించుటకై సిద్ధముగా డోబ్రుజా సరిహద్దులవద్ద కాచుకొనియున్నవి

## ఇంగ్లీషు ఛానలుమీదుగా తుపాకుల దెబ్బలు

### బ్రిటను-జర్మనీలయుద్ధము

అగస్టు ౧౯ వ తేదినుండి ౨౪ వ తేదివరకు బ్రిటను, జర్మనీలయుద్ధములో గమనించదగిన గొప్ప విశేషమేమన అగస్టు ౨౨ వ తేదినాడు ఫ్రెంచి సముద్రతీరమునుండి జర్మనులు దూరమువరకు గుండ్లనుకొట్టగల తుపాకులను డోవరు సముద్రముగుండా పోవుచున్న ఒక ఓడపై గురిపెట్టి ప్రేల్చిరి. ఈఓడకు తోడుగా ఒక యుద్ధనావయుండెను అపుడు పగలు ౧౧ గం.ల సమయము. జర్మనులతుపాకులు ఫ్రెంచి సముద్రతీరమందు కలేనుండి బూలోను వరకు అమర్చబడియుండెను ఆతుపాకులను ప్రేల్చువారికి గురి సరిగాకనపడకుండచేయుటకై తోడుగానున్న యుద్ధనౌక పొగ ఆవరణమును కల్పించెను. ఆప్రేలుడుధ్వనికి సముద్రతీరమువెంటనున్న ఇంగ్లాండు పట్టణములన్నియు అదిరెను. సముద్రములో నీళ్లు స్తంభములవలె పైకిలేచెను. ఈవిధముగా అర్ధగంటసేపు అపిఅపి ప్రేల్చినతర్వాత, గుండ్లన్నియు వ్యర్థములైనట్లు తేలెను ఈవిధముగా ప్రేల్చుచున్నంతసేపు ఫ్రెంచిసముద్రతీరమునన్న జర్మనుతుపాకులపై బ్రిటిషువిమానములు బాంబులను వేయుచుండెను అందుచే అపిఅపి ప్రేల్చవలసివచ్చెను ౧౦ నిమిషములతర్వాత బ్రిటిషుఓడ క్షేమముగా వెళ్లిపోయెను.

జర్మనుల పెద్దతుపాకుల ప్రయోగమునకు జవాబుగా బ్రిటిషుసముద్రతీరమునుండి బ్రిటిషువారుకూడ పెద్దతుపాకులను అగస్టు ౨౨ వ తేదినాటి సాయంకాలమే కలేప్రాంతముమీదికి ప్రేల్చిరి

ఇకమిగిలినవన్నియు బ్రిటనుపై జర్మను విమానాల బాంబులదాడులే. ఈదాడులు ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రివేళల కూడ జరుగుచుండెను. కాని ఈ సారి జర్మను విమానములు కొద్దిసంఖ్యలోవచ్చి దాడులు జరిపెను, అందుచే నష్టములసంఖ్యలు కూడతక్కువగానే యున్నవి ఆ నష్టాలసంఖ్యలు క్రింద తెల్పబడుచున్నవి —

| తేది | బ్రిటను. | జర్మనీ. |
|---|---|---|
| అగస్టు ౧౯ | ౨౨ | ౧౫౨ |
| ,, ౧౯ | ౩ | ౫ |
| ,, ౨౦ | ౨ | ౧౩ |

తక్కిన రోజుల లెక్కలు సంపూర్ణమైనవింకను తెలియుటలేదు కాని ఇంతవరకు మొత్తము ౧౧౨ జర్మను విమానములు జూను ౧౮ నుండి క్రిందకూల్చబడినవి



## అమెరికా కెనడాల సంయుక్తరక్షణ ఏర్పాటు

### బ్రిటనుకు ఎక్కువసహాయము లభింపజేయు ఉపాయం

అట్టావా, అగస్టు ౨౧

కెనడా విమానశాఖామంత్రి సి. జి. పవర్ నౌకాదళాధికారి కమొడోర్ హెచ్. ఇ. రీడ్ గారలు అగస్టు ౨౧ వ తేది రాత్రి న్యూఫౌండులాండుకు వచ్చిరి. వీరిరాక మెకంజీకింగ్, రూజ్వెల్టుగారలు చేసికొన్న డిఫెన్సుబోర్డు ఒడంబడికకు సంబంధించియుండెను న్యూఫౌండులాండులో ఒక నౌకాకేంద్రం స్థాపింపబడవచ్చుననియు, దీనికి అమెరికాస్టేట్సు, కెనడా ప్రభుత్వాలవారు సహకారము చేసెదరనియు అనుకొనుచున్నారు

వాషింగ్టనులో కెనడాతరఫున నౌకాసంబంధబోరిగా కెప్టెన్ బ్రోడోర్ గారిని, మిలిటరీ రాయబారిగా కర్నల్ హెచ్. ఎఫ్. పెట్సుగారిని కెనడాప్రభుత్వమువారు నియమించిరి.

ప్రస్తుతం కెప్టెన్ విక్టర్ బ్రోడోర్ పసిఫికు సముద్రములోవున్న కెనడాలనౌకాదళాధికారి

రూజ్వెల్టు అధ్యక్షుని ప్రకటన

నౌకాకేంద్రాలయవిషయమై బ్రిటనుతో సంభాషణలు తృప్తికరముగానే సాగుచున్నవనియు, స్పష్టమైన ఫలితాలు ఎప్పుడు చేకూరునని తాము ఇప్పుడే చెప్పజాలననియు రూజ్వెల్టు అధ్యక్షుడు పత్రికావిలేఖరులకు చెప్పెను.

బ్రిటను, అమెరికాల సంబంధము

మున్ముందు ఎవ్వరైనా పశ్చిమార్ధగోళంమీద జరుగబోయే దాడిగురించి ఆలోచించడానికే కెనడాలో చర్చలు జరిగినవి.

పసిఫిక్ లో నౌకాశ్రయాల విషయమై ఆంగ్లో అమెరికన్ సహాభావంమీద చర్చిల్ చేసిన వ్యాఖ్యానాన్నిబట్టి అట్లాంటిక్ లో కూడా అట్టి ఏర్పాట్లు ఏవో జరుగబోతున్నాయని అనుకోకూడదని ఈదినము సమ్నర్ వెల్సుగారు ప్రకటిం

పసిఫిక్ లో విమానాశ్రయాల గురించి యుద్ధానికిపూర్వమే బ్రిటను, అమెరికాలమధ్య సమాధానంకుదిరినదనిలండనులో చెప్పకొనుచినారు, చున్నారు

డిఫెన్సుబోర్డు సభ్యులు

అమెరికా కెనడాదేశాల సంయుక్తరక్షణబోర్డు సభ్యుల పేర్లను రూజ్వెల్టుగారు కెనడాప్రధాని మెకంజీకింగ్ గారు ప్రకటించిరి, అమెరికాపక్షాన నలుగురు. కెనడాతరఫున నలుగురు.

ఈబోర్డు ప్రథమసమావేశం అగస్టు ౨౬ వ తేదినాడు అట్టావాలో జరుగును.

అమెరికానౌకా సురక్షితప్రయాణము

ఫిన్లాండి పెట్సామోనుండి అమెరికా శరణార్థులను, నార్వేయువరాణిని అమెరికాకు తీసుకవచ్చుచున్న "అమెరికన్ లీజియన్" అనునావ ఇప్పుడు బ్రిటిషుతీరమునుండి పశ్చిమవైపు ౬౦౦ మైళ్ళదూరముగా వచ్చినది కాబట్టి జర్మను మందుగినుల ప్రమాదమునుండి బయటికి వచ్చినది.

ఈవిమానాల దాడులలో ఒక్కొక్కసారి జర్మనులు మరతుపాకులతో ప్రజలకు ఉపద్రవము కల్గించ యత్నించుచున్నారు జర్మనులు బ్రిటిషువారి విమానాశ్రయాలపై గురిపెట్టవలెనని వచ్చుచున్నను బ్రిటిషువారు ఆవిమానాలను ఎదుర్కొని తరుమగొట్టుచు పోవుచుండుటచే ఆ ఉద్దేశ్యము ఫలించుచుండుట లేదని బ్రిటిషువారనుచున్నారు, ఇంతవరకు ఇంగ్లాండు, వేల్సులపై జర్మను విమానాలదాడులు జరిగినవి. అగస్టు ౨౪ వ తేది రెండుసారులు లండనునగరముపై జర్మనుల దాడులు జరిగినవి. జర్మనులు ఇదివరలో విమానంనుండి కొట్టిన ఒక ఐరిషు ఓడపై మరల అగస్టు ౨౨ వ తేది బాంబులువేసిరి. కాని అదితప్పించుకొనిపోయెను.

ఒక విశేష-మేమనగా

అగస్టు ౨౪ వ తేదికిముందు ౧౦ రోజులలో మ. ఘ. శ. నిజాం ప్రభువుగారు ఇప్పించిన విమానాలదళమువారు ౨౮ కంటె మించిన శత్రువిమానాలను క్రిందికి కూల్చిరి.

## జర్మనీపై బ్రిటిషు విమానాల దాడులు

జర్మనీపైనను. జర్మనీ ఆక్రమించిన ప్రదేశాలమీదను బ్రిటిషు విమానాలు ప్రతిరోజు రాత్రియందు ప్రకారముగ తిరుగుచు జర్మనుల విమానశ్రాలకును, పెట్రోలు ఖజానాలకును, రైల్వేలకును, రోడ్డులకును నష్టములను కలిగించుచు చేయుచున్నవి.

## ఇటలీ-బ్రిటనులయుద్ధము

బ్రిటిషువారు ఆఫ్రికాలో బ్రిటిషుసోమాలిలాండునుంచి తీసివేసిన సేనలు ఏడనుకుచేర్చబడినవి. మధ్యధరాసముద్రప్రాంతములోను ఆఫ్రికాలోను బ్రిటిషువారికుండే ప్రదేశాలను సమీపంలో తటస్థరాజ్యాల నావలు తిరుగరాదని ఇటలీ ప్రభుత్వమువారొక హెచ్చరిక గావించి, ఆ బ్రిటిషుప్రదేశములను ముట్టడించుచున్నామని ప్రకటించినారు. ఇంతకుమించి ఇటలీబ్రిటనుల యుద్ధంలో వారిప్రదేశాలమీదవీరు, వీరిప్రదేశాలమీదవారు విమానాలలోపోయి బాంబులువేయుటతప్ప మరివిశేషము గానిలేదు. బ్రిటిషువిమానాలు అబిసీనియా ప్రధాననగరమగు అడిస్ అబాబాపైనను, డెస్సీపైనను, డిరెడావా, పైనను బాంబులువేసెను.

## కొన్ని బ్రిటిషు కేంద్రాల రక్షణ అమెరికాకు కౌలు

బ్రిటిషువారు న్యూఫౌండులాండులోను, వెస్టుఇండీసులోను. ఇతరచోట్లను తమ నౌకా, విమానరక్షణకేంద్రాలకు అమెరికావారు వాడ్కొనుటకు సౌకర్యములు కలిగించెదమనియు, త్వరలో మధ్యతూర్పుప్రాంతములో గొప్పయుద్ధము జరుగవచ్చునని తోచుచున్నదనియు బ్రిటను పూర్వముకంటె బలిష్ఠముగానున్నదనియు అగస్టు ౨౦ వ తేది పార్లమెంటు కామన్సుసభలో ప్రధాని చర్చిల్ గారు ప్రకటించిరి.

# ఉద్దేశ్యము నెరవేరేవరకు ఉపవాసము

## డి. హెచ్. దేశాయిగారి ప్రకటన

దేశాయి అను ఉస్మానియా కళాశాల విద్యార్థి యాక్షన్ సభ్యుడును council of action) యిట్లొక ఇంగ్లీషు కరపత్రములో ప్రకటించినాడు.

న్యాయాధికారులకై పోరాడువారిని నియమించువారిలో ఒక భావకల్మలము (confusion) బయలుదేరినది. ఒకపక్షంవారు వందేమాతరగానం సాంప్రదాయికం (కమ్యూనల్) అన్నారు. మరొకపక్షంవారు "ఆత్మగౌరవులేని సెలవ్రపెట్టుతారో అట్టి ప్రోత్సాహకారులని భావించుకొండి" అని మాకుహితవుచెప్పుచున్నారు. ఇట్టి వాదముచేయువారు సరియైనఆలోచనలేనివారు. వివాదముచేయునాయకులు జనులను మోసము చేయుచున్నారు. సాంప్రదాయికతను దుర్బలులును, అసహనపరులును హ్రస్వబుద్ధికలవారును కలిగియుందురు. తోడేలు మేకపిల్లకథను విన్నవారికి సాంప్రదాయికత బాగాబోధపడును."

ఇట్టిసంఘటనమే ఉస్మానియావిద్యాపీఠములో సంభవించినది. వందేమాతరంఅను పవిత్రగానక నిషేధింపబడినది కొందరివిద్యార్థులకు ఇదిసంకటంగా ఉందని అనుకొన్నను మా ప్రత్యేకగదులలో దానిని గానముచేసుకుంటే వారికేమినష్టము. స్వాతంత్ర్యం అందరికిని కావలెను. ఇదేసరియైనదైతే దానికొరకై నేను ప్రాణాన్ని కూడా బలిదానముచేయవలసియుండును. మతప్రవక్తలైన బుద్ధ క్రీస్తు మహమ్మదు గారలు ఆదర్శానికై ఆత్మార్పణం చేసినారు. మతస్వాతంత్ర్యానికై వారిజాడలను అనుసరింతును, కావున ఉద్దేశ్యమునెరవేరేవరకు ఉపవాసదీక్ష నవలంబించుచున్నాను

## ప్రధాన మంత్రిగారికి డీ. హెచ్. దేశాయిగారు అంపిన లేఖ

పూజ్యమహాశయా,

ఉస్మానియా విద్యాపీఠ హిందూ విద్యార్థుల పక్షాన తెమసునతకు తెలుపుకొనవలసిన కొత్తసంగతి యేమియును లేదు. మాకష్టాలను నివారించుటకై పలుమారు తెలుపుకొన్నాము మరొకమారు జ్ఞాపకము చేయుచున్నాము.

మాకష్టాలివి:—

౧. హాస్టలులో మాప్రత్యేకహాలులో వందేమాతరం గానంచేయుటకు సెలవియ్యలేదు.

౨. మావిద్యార్థులను నాటికి ౪౦ లేక ౪౫ కన్న ఎక్కువ తీసుకోకుండా ఉన్నారు.

3. నీతివిద్యకు బదులుగా మతవిద్య మాతృభాష ద్వారా ఏర్పాటు చేయవలెను.

ఈకష్టాలు నివారించకుంటే ఉపవాసవ్రతము అవలంబించుట నా విధియని తలచుచున్నాను. మీదయ మాఅదృష్టం. ఒక నెలలో సవరణ కాకున్న ఉపవాసవ్రతాన్ని అవలంబించుచున్నాను.

మీవిధేయుడు

దేశాయి (విద్యార్థి)

### శోకసభ

హైదరాబాదు (దక్కన్), మెహరు ౧౪

మైసూరుమహారాజా వర్ణమునకు విచారమును తెలుపుటకై సికింద్రాబాదులో రాష్ట్రీయులపక్షమున సోమవారమునాడు సాయంత్రముసభ చేయబడెను. రాజా ధర్మకరణ్ బహద్దరు గారు అధ్యక్షతవహించిరి మహారాజుగారి మరణమునకు తమవిషాదమును తెలుపుచువారి కుటుంబానికి తమసానుభూతిని ప్రకటించుచునొక తీర్మానమును గావించిరి దానినిగురించి డి॥ఎ॥ లోబోగ్రాసు సర్ టాస్కరు గారును, తదితరులును మాట్లాడిరి

## పద్మశాలి యువకసంఘము

(ఒ-వి)

నారాయణగూడెము (హైద్రా) మెహరు ౧౪

ఈ యువకసంఘము హైదరాబాదు సికింద్రాబాదు పద్మశాలియువకులచేత స్థాపింపబడినది. ఈసంఘముస్థాపింపబడినది. ఈ సంఘస్థాపనకు వైద్యభూషణహాకీము జగన్నాథస్వామిగారు, నారాయణగూడయందుగల తెమఫార్మసీలో స్థలమొసగిరి. ఈసంఘముపక్షమున గత ౧౪ దినముల క్రిందట మామిడిఆంజయ్యగారి అధ్యక్షతన నొకసభజరుపబడెను అందు ఈక్రిందనుదహరించిన తీర్మానములు జరిగెను.

౧. యువకులెల్లరు పరస్పర భేదాభిప్రాయములు మాని సోదరప్రేమ మరియు ఐకమత్యముతో మెలగుచు సంఘోన్నతికై పాటుబడవలెను ౨. పద్మశాలిసంఘములో విద్యావంతుల సంఖ్య చాలతక్కువయున్నందున విద్యాభివృద్ధికొరకు ప్రయత్నించుట ముఖ్యకర్తవ్యము. మరియు నిరుపేదబాలుర విద్యకు తగుసహాయము చేయుట. 3. మనకులజులలో శుభాశుభకార్యములందు కులపెద్దలవలన దురాచారములు దినదినమునుప్రబలుచు హీనదశకు తెచ్చునట్టి దుర్దశను నిర్మూలించుటకై ప్రయత్నించవలయును ౪. మద్యపాన దురాచారమును నిర్మూలించుట అవశ్యకము యన్. వెంకటస్వామిగారు, ఈసంఘమునకు ఉపాధ్యక్షులు హరికిషన్ దాసుగారు బి ఏ. కార్యదర్శి యల్లండి ఆనంతయ్యగారు, సహాయకార్యదర్శి పటుకంక శ్రీరాములుగారు మరియు యస్-వి-శివయ్యగారు, సాధారణ సభ్యులు సి-మనోహరదాసుగారు, కమ్మల రామచంద్రరావుగారు బి-ఏ-, యన్-నర్సయ్యగారు పచ్చబాలయ్యగారు, మూసపాండురంగముగారు, భోగ శంకరరావుగారు ఉడుత సచ్చిదానందంగారు, గంజుసత్యనారాయణగారు చుంచుసత్యనారాయణగారు ఈవిధము గా(౧౧)రుందరెన్నుకొరబడిరి

## విచిత్రబాలిక యుత్పత్తి

(ఒకవిలేఖరి)

తా॥ మిర్యాలగూడెంలో చేరియున్న మ॥ మొల్కపట్నంయను గ్రామంలో మొగుసాల పాట్టిలచ్చియను హరిజనయువతికి శ్రీ విక్రమనామసం॥ శ్రావణబ౧ ఆదిత్యవారంపుదయం ౩౧౦. లకు ఆడశిశుపుజనించి భూపతనంకాగానే కూర్చొనబోయి, పెలకిలబడి, వికటనవ్వు ప్రారంభించి నేటివరకు నవ్వుచుసేయున్నది. శిశుస్వరూపము తెల్లన, బాహువులు 'సడుపు, ముఖమున త్రినామధారణ, చిహ్నము నరములు మాడపై కొప్పువిధమైబోడుపు. ముంగురులు, శరీరము ౬ నెలల బాలికగా జూపట్టును.

## వందేమాతరంసమితి

అభిప్రాయప్రకటన

హైదరాబాదు, మెహరు ౧౩

రెండుసంవత్సరాలనుండి వందేమాతరంసమస్యప్రజలకును ప్రభుత్వానికిని ప్రాముఖ్యమైపోయినది, గతనవంబరు ౧౯౩౮లో వందేమాతరంపై అంక్షఏర్పడెను,ఉస్మానియాహాస్టలులో హిందూవిద్యార్థులు తమప్రత్యేకప్రార్థనాలయంలో కూడ దీనినిపాడగూడదనిశాసించిరి. దానిఫలితంగా చాలమంది కళాశాలల వదలి నాగపూరుకుగూడాపోయిరి. అక్కడికిని ప్రభుత్వానికి దయరానందున జూలై ౧౯౪౦లో రాష్ట్రవిద్యార్థులందరు సమ్మెచేయనిశ్చయించిరి ఆసమయంలో కొందరు పెద్దలు విద్యార్థులను నిరోధించిరి. సమ్మెనుమాన్పించి విద్యార్థులను కళాశాలలో చేర్చిరి. ప్రభుత్వంవారు విద్యార్థులను స్కూళ్ళలోనికి తీసుకొని చిల్లర సదుపాయాలుచేసిరి, డ్రెస్సునిర్బంధముతీసివేసిరి నీతివిద్యకుబదులుగా హిందూవిద్యార్థులకు వారిమాతృభాషలలో సంస్కృతసంబంధము నేర్పాటుచేసి బోధించునేర్పాట్లుచేయుదుమనిరి. కొంచెము వ్యవహారం చల్లబడినతర్వాత వందేమాతరంసమస్యకూడా తీర్పుచేయుదుములేఅని అనిరి, ప్రజాప్రతినిధులకమిటీ దీనికైఒకటిఏర్పడెను ఆకమిటీవారొకజ్ఞాపికను ౧౪-౨-౪౦నాడుపంపి హోంసెక్రెటరీగారిని ౧౨-3-౪౦నాడు కలిసిమాట్లాడెను. కాని ప్రభుత్వమువారు ముఖ్యమగు షికాయతులను తొలగించుటకుసిద్ధపడలేదు

తర్వాత యం, నరసింగరావుగారును, కే, యస్. వైద్యాగారును ప్రభుత్వాధికారులనుకలిసిరి. కాని లాభంలేకపోయెను,

నేటివరకును హిందూవిద్యార్థులు తమప్రార్థనాలయాన్ని ఉపయోగించుకొనుటలేదు. విద్యాపీఠముయొక్క సాంఘికవ్యవహారములలోను జోక్యం కలిగించుకొనే ఉల్లాసంలోలేకుండా ఉన్నారు. విద్యార్థులు చేసినత్యాగాలు గవర్నమెంటుపై ఏమియు అసరుకాలేదు. కమిటీవారి ప్రయత్నాలన్ని వ్యర్థంఅయినవని విచారముతో తెలుపుకోవలసివచ్చినది.

ప్రజలు తమగాఢమగుఅభిప్రాయాన్ని ప్రభుత్వానికి బాగామనుసుకువచ్చేటట్లుగా తెలుపుకోవలెను, డీ. హెచ్ దేశాయిగారుఅను బీ. యస్సీ విద్యార్థి ఈవిద్యార్థులకష్టాలను నివారించేవరకు ఉపవాసమును అవలంబించుచున్నానని ప్రకటించినది, ప్రభుత్వంవారిదృష్టికి తెచ్చుచున్నాము, విద్యార్థులలో ఎంతగదుము గా ఈ సమస్య ఇంకపోయినదో దీనివలన విశదమగును.

పరిస్థితివిషమించకముందే ప్రభుత్వమువారు విద్యార్థులకోరికలను నెరవేర్తురని ఆశించుచున్నారు—

యల్-ఏ-గాను

౨౦-౮-౧౯౪౦

## మతభేదాలు సమన్వయించండి

నిజాం ప్రభుత్వాజ్ఞ

హైదరాబాదు (దక్కన్) ఆగస్టు-౨౩.

హైదరాబాదుప్రభుత్వంవారు అందరినూ జేదారులకున్ను తాలూక్దారులకున్ను మతభేదాల్లను చెందకుండా పరస్పరం సహనము వృద్ధియగునటుల చూచుకొనవలసినది తెలిపినారట. యుద్ధకమిటీపనులతోపాటు ఈపనినిగూడ ప్రధానముగా వైతధికారులు నెరవేర్చవలెననియు, యుద్ధానంతరంకూడా ఈవిధానము చాల మంచి పర్యవసానముకలదిగా నుండుననియు తెలిపినారట.

## అరబ్బు సేగేదారుల వివాదము

హైదరాబాదు (దక్కన్) మెహరు ౧౭

ఈనగరంలో దివాన్ దేవిడీవద్ద పొజ్దారీబల్దాపెనుకను నజమెజమియత్ శాఖ ప్రధానకార్యాలయములో నిన్న ఒకఅరబ్బుకును సేగేదారుకును దెబ్బలాటజరిగినది. సేగేదారుడు లంచము అడిగినందువలన కొట్టితినని అరబ్బువాడనుచున్నాడు, నాజింగారి ఆజ్ఞఅయినచో మిసలు చూపించగలనని చెప్పినట్లుగా సేగేదారనుచున్నాడు, కార్యాలయము ఈవివాదముమధ్యలో మూసివేయబడినది.

## ఆరోపణకు సమాధానము

సనాతనులసంతకాలకుబేరము అనుహెడ్డింగుతో ప్రకటించినవార్త శుద్ధఅబద్ధము వాసినటుసంటిజిల్లాఆంజయ్యఆనే అతనిని సంతకముల నిమిత్యం వెంటరమ్మని నేను కోరియుంటిని. అతడు ౧౪ వత్సరములుకలిగినవాడు. తనకు భోజనంఖర్చుఎట్లు అనిఅడుగగా అఖర్చు నేనుయిచ్చెదను అనిచెప్పితినేకాని ఇన్నిసంతకములకు ఇంతద్రవ్యమని చెప్పలేదు ... యుటకు అంజయ్యగారికి బుద్ధియిచ్చి, నాతఅయిన తాటికొండ విశ్వనాథం సనాతనమతమునకు ప్రతికూలురగుటచే వారినిర్బంధంచేత అంజయ్యవ్రాసినది అనినాకు అంజయ్యచెప్పినాడు

ఇట్లు

తూర్పు వెంకట్రావు, స్వర్ణజోషి

## హిందు స్మశానవాటిక

(కాచిగుడెము)

హైదరాబాదు, మెహరు ౧౪

హిందూస్మశానవాటికకు సంబంధించిన అభియోగముఒకటి ఆవాటికకార్యదర్శియగు పాండురంగజోషిగారికిని సయ్యద్ అబ్దుల్ ఖాదరు గారికిని మధ్య మూడవనగర పౌజ్దారిన్యాయస్థానములో విచారణయగుచుండెను. ౧౩ వ తేదినాడు మాడపాటి హనుమంతరావుగారి వాజ్మూలముగైకొనబడినది.

సదరు స్మశానవాటిక ౨౫ సంవత్సరములుగా కమిటీవారి స్వాధీనములోనున్నట్లును, కమిటీకి జోషిగారు కార్యదర్శిగా ఎన్నుకొనబడియున్నట్లును, ప్రస్తుతము నడుచుచున్న అభియోగమును పెట్టవలెనాలేదాయని ఆలోచించినవాటి కమిటీలో తానుండినట్లును, స్మశానవాటికకై వచ్చువారికి సౌకర్యములు కలిగించుటయు, నౌకరీలపై నిగరానియు కమిటీవారి పనులనియు హనుమంతరావు పంతులుగారు తమవాజ్మూలములో చెప్పిరి.

## ప్రకృతి వైద్యుడు

హైదరాబాదు (దక్కన్),ఆగస్టు ౨౩

సిటీరిజిస్ట్రారు గారగు సయ్యద్ముజఫరుద్దీన్ సాహెబ్ గారిట్లు వ్రాయుచున్నారు:—

డాక్టరు, సయ్యదుఅక్బర్ అలీసాహెబ్ గారు మద్రాసులో చాలాకాలముగ వైద్యము చేయుచుండెడివారు. నాసోదరి తొమ్మిదిసంవత్సరములుగ రోయిలాగాయుండినది. హైద్రాబాద్ నందు గొప్పడాక్టరులందరుచికిత్సలుచేసినారు. ఈ మెబాగుపడుటకు యిక ప్రయోజనములేదనిచెప్పిరి. తర్వాతమద్రాసునుండి పైడాక్టరు అక్బర్ అలీసాహెబ్ గారినిపిలిపించితిమి. వారు అయమ్మకు వైద్యము ప్రారంభించినారు. ౧౫రోజులలో చాలాగుణముకలిగినది. ౨౦ రోజులలో బాగానడువకలిగినది నెలరోజులలో సంపూర్ణఆరోగ్యముకలిగినది. వారి వైద్య ప్రభావమును చాలాఆశ్చర్యముకలిగినది, ఇది చూచినవారెల్లరు వారిదగ్గర వైద్యముపొందుచున్నారు. బహుకాలముగ వైద్యులకేలొంగని గొప్పవ్యాధులు వీరిదగ్గరబాగవుచున్నవి. వీరిపుడు మాయిలోకాలోనే యున్నారు. వీరలయందు బహుదయగలవారు. ... ధులవాండ్రు వీరిచికిత్సలుపొంది బాగుపడవలయునని సదుద్దేశముతో నేనీవ్యాసమువ్రాయుచున్నాను డాక్టరువారుండు అడ్రస్సు "డాక్టరు సయ్యద్ అక్బరుఅలీసాహేబు, అహమ్మద్ మంజిల్, కుతుబ్ సాహెబుమసీదువీధి పాతమలకుపేట, హైద్రాబాదుదక్కన్".

## బాల్యవివాహనిషేధ శాసనము

### సనాతనప్రచారకుల బెదిరింపు

నల్లొపురం, (మెదకుతాలూకా) అగస్టు ౧౭

నిన్న ఇక్కడికి హైదరాబాదు నాంపల్లివాసి యగు టి-రామస్వామి సనాతనధర్మ ప్రచారక సమితినుండి వేంచేసి గ్రామీయులను సుమారు ౬౦-౭౦ మందిని ప్రోగుచేసి కరపత్రములుపంచి బాల్యవివాహనిషేధచట్టమునకు వ్యతిరేకప్రచారము జేసి మహజరునామాపై సంతకము జేయించ గోరిరి. గ్రామస్థులు సంతకములు చేయ నిరాకరించినందులకు పైప్రచారకుడు వారికి కాయదు పోలీసుసర్వాధికారియగు పాలిస్సు గారివద్దచేసి ఖుఫ్యాలద్వార వీరికి చాలచాల ఇబ్బందులుపెట్ట గలనని బెదిరించిరి, పైగా సర్కారు ఈ సనాతన ప్రచారకులను రహస్యముగా నియమించినారు కావున మీరు ఈప్రచారకులకు ప్రతికూలురైతే మీకు సర్కారుద్వారా చాలాకష్టాలు భరింపవలయుననికూడ చెప్పిరి. ఇంకొకమాటవారిట్లు చెప్పిరి. శాసనము ప్రౌఢావివాహము అమోదించబడితే ప్రతిని హమునకుగం-౨౦రూపాయిల జుంకము సర్కారువారు నిర్ణయించగలరని చెప్పిరి. అతివిపప్పు ఇక్కడకుడకవంతున తలక్రిందచేసినొని వేరేగ్రామమునకు వెళ్ళిరి వీరలను అమాయకులనిట్లు మోసముచేయుట ఏంత సాహసము!

ఇట్లు
ఆర్. దుర్గారెడ్డి

## పానగల్లు

### భర్తీబండీ పాటుపడుట

### అపాయకరమగు చెరువుబాట

(స్వ-వి)

ఇదివరలో ఈపత్రికలో నాగర్కర్నూలు తాలూకాలో చేరిన పానగల్లువార్తలు వ్రాయుచు ఈగ్రామానికి రెండుమైళ్లదూరాన అన్నవరం అనే గ్రామంకలదు. అది జటప్రోలుసంస్థానంలోచేరినది. అచ్చటనిమ్మచెరువుకలదు. దాని పైబాట ఏమాత్రమున్ను బాగాలేదనియు అది తప్ప చుట్టూ ౨౦మైళ్లదూరం పోవలెనంటే వేరేబాటగతిలేదనియు తెలిపియుంటిని. ౧౦ దినాలక్రిందట ఒకవర్తకుడు భర్తీపానూనుబండ్లతోపోవుచుండగా బండి పాటుపడి చెరువులో పడిపోయెను ప్రభుత్వవారు ఈబాటను విశాలముగా చేయించి రిపేరుచేయించకుంటే వ్యాపారనష్టం, ద్రవ్యనష్టం, మనుష్యులప్రాణనష్టం, పశువులప్రాణనష్టం ఈవిధంగా అన్నినష్టకష్టాలు సంభవించును

## ఆంధ్రవిజ్ఞాన గ్రంథాలయము

సదాశివపేట మెహరు౧౩

(విలేఖరి)

ఈ శ్రావణశు॥ ౧౫ నాడు సాయంత్రము గ్రంథాలయావరణయందొక సభసమావేశ పరచబడినది శ్రీయుత బచ్చు వెంకటేశ్వరగుప్తగారు ఉపాకర్మయొక్క ప్రాముఖ్యతను, ద్విజాతీయులు శ్రావణశు॥ ౧౫నాడాకర్మను విధివిహితముగ నాచరించవలసిన విధాయకమునుగురించి విపులముగ నుపన్యసించిరి. రక్షాబంధనాచారముయొక్క పుట్టుపూర్వోత్తరములను తెలుపుచు, ప్రతివారు ధర్మముతప్పక ప్రవర్తించెదమని కంకణముగట్టి శపధముచేయుటకై యీ ఆచారమానాటినుంచియు తివరకు జరుగుచున్నదని తెలియపరచిరి. నాగపంచమినాటి సమావేశముకంటె ఈసమావేశమునందెక్కువమంది పాల్గొనుటసంతోషదాయకమనియు ప్రతిపంతుగయుండీవిధమునసేసమావేశములు జేయుచుండుట లాభదాయకమనియు, తామందరు సభలోపాల్గొని గ్రంథాలయము నున్నతదశకు తేగలరని కోరుచున్నానని విరమించిరి.

## జాగీర్దారుల సవాళ్లు

### గొప్ప రాజ్యాంగ సమస్యలపై చర్చ

హైదరాబాదు (దక్కన్), మెహరు ౧౪

హైదరాబాదు జాగీర్దారుల సంఘము వారిటీవల హైప్రాయి గారు భారతదేశమునకిచ్చుటకు వాగ్దానము చేసిన వరములనుగురించి చర్చించినారు. ఈ అసఫ్ జాహీ రాష్ట్రముగతి ముందేమికాగలదో ఆనేవిషయాన్నిగూర్చి ఆలోచించినారు నిజాం ప్రభుత్వం వారేమాత్రమున్ను ఆలస్యంచేయకుండా జాగీర్దార్ల ప్రతినిధులతో ఈక్రిందివిషయాలనుగురించి ఆలోచనచేయవలసినదని తీర్మానించినారు.

౧. ఇండియాయొక్క సంరక్షణలోను విదేశాంగ తంత్రములోను హైదరాబాదు స్థానమేది?

౨. హైదరాబాదు రాష్ట్రముయొక్క స్వతంత్రస్థితిని భాయంగాఉంచి రాష్ట్రంలోశాంతిభద్రతలను కాపాడేదానికి అవసరమైనవిషయాలేవి?

3. హైదరాబాదుకున్ను బ్రిటిషువారికిన్ని జరిగియుండిన సంధిషర్తుల ప్రకారము బాధ్యతలను హక్కులను ఇకముందునడిపేవారెవరు? ఈ విషయంలో తుదిమాట మ. ఘ. వ. నిజాంగారిదే,

౪. హైదరాబాదుయొక్క రాజ్యాధికారములో ముందుఏమిన్ని దఖలులేకుండాకాపాడుకోవలెను.

## బాల్యవివాహనిషేధ శాసనమును బలపరచుట

తిరుమలగిరిబజారు. అగస్టు ౧౭

తిరుమలగిరిబజారు ఆర్యవైశ్య యువజనసంఘమువారు శ్రావణ శు॥౧౫ శనివారం ౧౭ ఆగస్టు ౧౯౪౦ రోజు ఉదయము సంఘసభనమున్నదే, సమావేశమై, వైదికరీత్యా, హోమము (హవనం)చేసి, నూతనయజ్ఞోపవీత ధారణగావించి, హైద్రాబాదు, శాసనసభలో ప్రవేశపెట్టబడిన, "బాల్యవివాహనిషేధశాసనము" ఆమోదించుచు యీక్రిందివిధముగా యేకగ్రీవముగా తీర్మానించిరి.

తీర్మానము

"హిందూజాతియొక్క, శారీరక, మానసిక, నైతిక, వైజ్ఞానిక, శక్తులను నశింపజేయుచు, ప్రధానవేదధర్మమైన బ్రహ్మచర్యమును పాడుజేయును. హిందూమతమును నిర్వీర్యముజేయుచు విచ్చలవిడిగా విహరించుచున్న బాల్యవివాహ దుష్టాంశసిని దునుమాడు "బాల్యవివాహనిషేధశాసనమును, చట్టముగావించుమని యీసంఘమువారు మ-ఘ-వ- నిజాంప్రభుత్వమువారిని ప్రార్థించుచున్నారు"

ఇట్లు
ఆకులరాజయ్యగుప్త
కార్యదర్శి

గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర శ్రావణ బ॥ ౮
సోమవారము

# హిందూమహాసభా తీర్మానాలు

హిందూ
న ముఖ్య
చర్చించియుం
తీర్మానముల

మహాసభ
అనువిష
ఏవవిష
జా
అల్పవచ్చు
...స్తుతము.

హిందూమహాసభవారు కేవలము హిందూ పక్షపాతముగా తీర్మానాలు చేయుదురేమోఅని భయపడియుంటిమి. ఎందుకంటే ఆమహాసభ జరుగకముందే దాని తీర్మానాలు బయలుపడకముందే అది సాంప్రదాయిక (మతపక్షపాతసంస్థ) యని తీవ్రాందోళనము ప్రారంభమయ్యెను కాని తీర్మానములను చూచినతర్వాత ఈ మహాసభలో ఒకటిరెండు తీర్మానములుతప్ప తక్కినవన్నియును యితర "జాతీయ" సంస్థలు కావించినట్టి తీర్మానాలేఅని తేలినది ముఖ్యముగా ఆంధ్ర కర్ణాటకమహాసభలు చేసినతీర్మానాలే యిందు బహుళముగా వ్యక్తమైనవి.

హిందూ అనుపదమును తీసివేసి ఆంధ్ర అనుపదము చేర్చితే ఆంధ్రమహాసభా తీర్మానాలేమో అని ఈహిందూ మహాసభవారి తీర్మానాలలో నూటికి ౯౦ పాళ్లతీర్మానాలు స్ఫురించుచున్నవి. ఎట్లంటారా?

అస్పృశ్యతాదోష నివారణము,మాతృభాషలలో విద్య, కచ్చేరీలలో ప్రాంతీయభాష, ఖాస్గీపాఠశాలలపై ఆంక్షను తొలగించుట, రైతులసంబంధవిషయాలు లు, నిధి, శాఖాస్థాపనము, పఠేలుపట్వారీలు, వ్యాయామము, సంస్కృతాభివృద్ధి, జాగీర్దారీతులు, ప్రాథమికస్వత్వములు, ప్రెస్సుశాసనము, ప్రభుభక్తి, ఉద్యోగాలు, ఈతీర్మానాలు మాకు జ్ఞాపకమున్నంతవరకు ఆంధ్రమహాసభలోను పలుమారు కావింపబడినవి. అవేతీర్మానాలు హిందూమహాసభలోను కావింపబడినవి. ఈహద్దువరకు ఆంధ్రమహాసభ సాంప్రదాయికసంస్థ కాకున్న హిందూమహాసభకూడా కాదనే ఏవరైనా సరే ఒప్పుకొని తీరవలసివస్తుంది.

ఇక మిగిలిన తీర్మానాలెవ్వి అనగా

౧. గ్రామముల పేరులను మార్చుట ఈరాష్ట్రములో ఆచారమైంది. అవిధంగా చేయక మార్చినపేర్లను తీసివేసి పూర్వం పేరులనేపెట్టండి, అనునదొకటి.

ఇందు తప్పుకానరాదు. ముషీరెదక్కన్ వారును దీనిని మెచ్చుకున్నారు.

౨. ఛత్రపతిశివాజీ, శ్రీకృష్ణదేవరాయలవంటి చారిత్రిక మహాపురుషుల జన్మోత్సవాలు చేయవలెను. అనునది రెండవది. అఖిలభారతీయుల కందరికి సంబంధించిన వీరుల ఉత్సవాలు హిందూ ముసల్మాను క్రైస్తవులందరును కలిసిచేయు కాలమువచ్చిననాడు అందరికిని పరమానందము కలుగును. కాని యీవీరులు సాంప్రదాయిక వీరులుకారు. ముసల్మానులు మొహర్రం, ఖిలాఫాలజయంతులు, పూజ్యపెగంబర్ మహమ్మదుగారి జన్మదినము మున్నగునవి చేయుచున్నారు. హిందువులును తమలో గొప్పవారి జయంతులచేయుటలో ఆశ్చర్యములేదు. దానిని "మతపాక్షికము" క్రింద అంటగట్టి నాలుగు చీవాట్లుపెట్టి మీ యీజయంతులను కట్టిపెట్టండి అని గుద్దులాడుటకు వీలులేదు. ఈ తీర్మానముకూడా "వైజ్ఞానిక నైతిక ధార్మికోల్బణ హేతువుగానుండును" అని ముషీరెదక్కనువారు అభిప్రాయమిచ్చినారు.

౩. వందేమాతరంగానము:— అది జాతీయగీతమనియే అఖిలభారత కాంగ్రెసువారు నిర్ణయించినారు. ముసల్మానుల తృప్తికై మూడేండ్ల క్రిందట రెండు చరణాలు మాత్రము తీసివేసినారు.

౪. మతకల్లోలాలలో నష్టపడిన హిందువులయెడ సానుభూతిని ప్రకటించుట — ఇది "చాలమంచి" తీర్మానము అని ముషీరెదక్కనువారు అభిప్రాయమిచ్చినారు.

౫. పాఠశాలలలో "నీతిశిక్షణమునకు" బదులు హిందువులకు ధార్మికశిక్షలేక గీతాశిక్షణము ఇయ్యండి అని తీర్మానించినారు. దీనిని ఉస్మానియావిద్యాపీఠ హిందూవిద్యార్థులు కోరినారు. ఆందోళనము చేసినారు. ఆందోళనము చేసిననాటినుండి నేటివరకే "జాతీయవాది"కూడా ఏ చిన్న నాయకుడు కానీ ఏ పెద్దనాయకుడు గానీ ఈ కోరిక "మతపాక్షికముతో" కూడినట్టిది అని గర్హించలేదు. ఇక శుద్ధపాక్షికము క్రింద ఏవిధముగానైనా అంటగట్టుదామని వెతకితే వేరేతీర్మానాలేమియున్ని గోచరించుటలేదు.

అయితే "మతపాక్షికం" అంటే యేమి? ఈ పదాన్నే హిందూస్థానీలో "సాంప్రదాయికత" అనియు ఇంగ్లీషులో "కమ్యూనల్" అనియు అనుచున్నారు. ఏ సంస్థనైనా సాంప్రదాయికం క్రింద కట్టివేసి లేవడీపట్టించుటకు ఈ పదము ప్రతిపక్షులుగా నేర్పడు వారికందరికిని వజ్రాయుధంవంటిది. హైద్రాబాదు స్టేటు కాంగ్రెసును ఏర్పడీ ఏర్పడనినాడే సాంప్రదాయికం అని అనలేదా? దానిపేరు మారినా దానికి ప్రభుత్వంవారు సెలవిచ్చిరా? ఒకేమతస్థులు ఒకసంస్థలో ఉంటే అది సాంప్రదాయిక సంస్థ అయిపోతుందని ఒక నిర్వచనం. అట్లైతే మనరాష్ట్రములో అన్నికూడా సాంప్రదాయిక సంస్థలే? ఒకరిద్దరు ఇతరమతస్థులుంటే చాలదుసుమా! దానిలో కుప్పలు కుప్పలుగా ఇతర మతస్థులుండవలసి యుండును!! హిందూ అని పేరు పెట్టుకొన్న సంస్థ ముస్లిం అని పేరు పెట్టుకొన్న సంస్థ సాంప్రదాయిక సంస్థ అని ... పేరునుబట్టి యేలోతు పాతులుచూడకుండా నిర్ణయించేవారు కొందరు! కాని ఈ సర్వతంత్ర స్వతంత్ర న్యాయ...

# బ్రిటిషుప్రభుత్వమువారి సూచనలు

## కాంగ్రెసు కార్యసంఘ అభిప్రాయము

వార్ధా, ఆగస్టు ౨౨

"ఆగస్టు ౮ వ తేదీన వైస్రాయిగారిప్రకటనలో గావింపబడిన సూచనలును ఆగస్టు ౧౪ వ తారీఖున కామన్సుసభలో ఇండియామంత్రి ఉపన్యాసమునందలి సూచనలును బ్రిటిషుప్రభుత్వమువారు తమయుద్ధాశయములలో ప్రకటించియుండిన ప్రజాప్రభుత్వసిద్ధాంతమునకుమాత్రమే గాక భారతదేశ క్షేమమునకుకూడ భంగకరములైయున్నవి. ఈకారణముచేత కాంగ్రెసువారు వానినంగీకరింపజాలరు. దేశప్రజలు వానినంగీకరింపవలెనని సలహానొసంగజాలరు" అని కాంగ్రెసు కార్యసంఘమువారు గావించినతీర్మానము తెలుపుచున్నది. ఈతీర్మానము ౭౦౦ మాటలుగల దీర్ఘతీర్మానము ఇపుడేతీర్మానము పత్రికలకు విడుదలచేయబడినది.

ఈ ప్రకటనలు కాంగ్రెసువారి కోర్కెలకు చాల కొరవడియుండుటమాత్రమే గాక భారతదేశములో స్వాతంత్ర్యము, ఐకమత్యము యేర్పడుటకుకూడ ప్రతిబంధకములుగానున్నవి. కావున ప్రజలు సభలుమున్నగు మార్గములద్వారాను, శాసనసభలలో తమప్రతినిధులద్వారను బ్రిటిషు ప్రభుత్వవైఖరిని నిరసింపవలెనని కాంగ్రెసు కార్యసంఘమువారి తీర్మానము కోరుచున్నది. ఇంకను తీర్మానములోనిట్లున్నది.

అఖిలభారత కాంగ్రెసు పరిషత్తువారి పూనా తీర్మానమునందుగల సూచనలను బ్రిటిషుప్రభుత్వమువారు నిరాకరించినందులకు ఈసంఘమువారు సంతాపముతెలుపుచు, కామన్సుసభలో బ్రిటిషు ప్రభుత్వపక్షమున కావింపబడిన ప్రకటనలయెడను, ఉపన్యాసములయెడను కోపము తెలుపుచున్నారు: ఈ ఉపన్యాసమువలన భారతదేశపుహక్కును సంపూర్ణస్వాతంత్ర్యమునేకుండ చేయబడుచుండెనని కార్యవర్గమువారు అభిప్రాయపడుచున్నారు,

ఏసామ్రాజ్యములోను భారతదేశ ముండజాలదనియు, సంపూర్ణస్వాతంత్ర్యముగల దేశముకావలెననియు యిటీవలజరిగిన విషయములవలన స్పష్టమైనది, భారతదేశము స్వతంత్రజేశమగుటవలన యితరదేశములతో కలసి లనిచేయుటకు ప్రతిబంధకమేమియును లేదని తీర్మానము తెలుపుచున్నది.

అల్పసంఖ్యాకులు స్వార్థములను రక్షించుకొనువారు ఆక్షేపణ తెలుపుదురను కారణమున ప్రజాప్రతినిధులకు అధికారమును బాధ్యతను సంక్రమింపజేయమని బ్రిటిష్ప్రభుత్వమువారు చెప్పినమాటల దేశములో అంతఃకలహములనుప్రోత్సహించునని తీర్మానము తెలుపుచున్నది.

అల్పసంఖ్యాకుల హక్కులవిషయమై కాంగ్రెసువారి వైఖరిని కార్యసంఘమువారు స్పష్టపరచుచున్నారు. కాంగ్రెసువారికోర్కె బలత్కారమనియు, భారతదేశాభివృద్ధికి ప్రబలమగు ఆటంకమనియు బ్రిటిషువారిచే చెప్పబడుచున్నది, వారిట్లనుటవలన దేశములోని విభేదములను యెక్కువచేయుటకు వారు పూనుకొనివారమభయము ప్రజలలో స్థిరమగుచున్నదని తీర్మానము చెప్పుచున్నది.

కేంద్రమున తాత్కాలిక ప్రభుత్వము నేర్పరపవలెనని కాంగ్రెసువారు కోరినకోర్కె పరిష్కరింపబడని రాజ్యాంగసమస్యను తీరుగదొడుననియు, అల్పసంఖ్యాకులకు నష్టమును, అధికసంఖ్యాకులకు లాభముకలుగుటకు అవకాశముండునని ఇండియా మంత్రియనుట, కార్యసంఘమువారికి ఆశ్చర్యముకలిగించెనని తీర్మానము తెలుపుచున్నది.

ఈ సూచనను నిరాకరించుటవలన అధికారమును ప్రజాయత్తముగావించుటనుద్దేశ్యము బ్రిటిషుప్రభుత్వమునకు లేనట్లు స్పష్టమగుచున్నదని తీర్మానము తెలుపుచున్నది.

### వైస్రాయిగారికి ప్రత్యుత్తరము

ఆగస్టు ౨౧వ తేది మౌలానా ఆజాదుగారు పత్రికాప్రతినిధులతో ఇట్లుచెప్పిరి:—

"వైస్రాయిగారు వాకువ్రాసిన పుత్రములో వీలయిన ౨౧వతేదిలోగా వాకుచేరులాగు మీరు దీనికి జవాబు పంపకోరుచున్నాను అని వ్రాసినారు. వైస్రాయిగారి ప్రకటనలోనిఅంశముల ప్రకారము కాంగ్రెసువారికిని ప్రభుత్వమువారికిని సమాధానము కుదరదని నేను కార్యసంఘసభలో తెలియజేసితిని. వారుకూడ నాతోయేకీభవించినారు. అందువల్ల మొన్న ౧౯వ తేదిన అదేరీతిగా నేను వైస్రాయిగారికి ఉత్తరములో తెలియజేసితిని. అది యీపాటికి వైస్రాయిగారికి చేరియుండును. ఈప్రకటనప్రకారము గూడిన నేను వారితో కలిసిమాట్లాడుటకు, అవకాశమేమియు కనపడదు వైస్రాయిగారు యింకను ముందుకు రాగలిగినచో నేనుకెళ్లి వారితో మాట్లాడుటకు సిద్ధముగానే వున్నాను.

వైస్రాయిగారి ప్రకటనపై కార్యసంఘమువారొక తీర్మానమును వ్రాసినారు. దానినికూడ వైస్రాయిగారికి పంపుతాను.

అహింసాసిద్ధాంతమును గురించి కార్యసంఘమువారిప్పుడు మళ్ళీ యోచిస్తున్నారు. ఇక్కడ కార్యసంఘసభలు పూర్తికాక పూర్వమే కార్యసంఘంవారు దీనినిగురించి కూడ ఒకప్రకటన చేసెదరు. దేశీయులందరును దీని ఫలితముకోసము నిరీక్షిస్తున్నారు.

మరల భారతకాంగ్రెసుసంఘసభను జరుపుటమునుగురించి కార్యసంఘమువారింకను ఆలోచించలేదు.

వైస్రాయిగారికిని జరిగిన ఉత్తరప్రత్యుత్తరాలను ప్రకటించుటకు అనుమతి నీయవలసినదనికూడ నేను వైస్రాయిగారికి వ్రాసితిను.

## ఒకరూపాయినోటుల పని

ఇండియాప్రభుత్వమువారు క్రొత్తగా ఒక రూపాయినోట్లను ముద్రించుచున్నారు. వాటికి అడిగినపుడే వెండిరూపాయల నిచ్చెదమను వాగ్దానమును అన్నినోట్లపైవలెనే ఒకరూపాయి నోట్లపైగూడ ముద్రించుటఅనవసరమని కల్లికుట కాంట్రాక్ట కమిటీవారు అభిప్రాయమిచ్చినారు. వెండిరూపాయలను కూడ బెట్టుకొనుటకు యత్నించుచున్నవారిచర్యను అరికట్టుటకే ఇట్టిఒకరూపాయనోట్ల ముద్రణపూనుకొనబడినపుడు పైనచెప్పినవిధముగ వాగ్దానముచేయుట అనవసరమని వారికారణమైయున్నది. కావలసినచో చిల్లర లభింపజేయవచ్చునట.

### కాంగ్రెసునుంచి తొలగించబడినవారి యుద్ధానుకూల ప్రచారము

ఒరిస్సారాష్ట్రములో పావకల్లు రాజాగారితో కలిసి మిశ్ర మంత్రివర్గము నేర్పరచుటకు యత్నించుటచే అఖిలభారత కాంగ్రెసు కార్యసంఘమువారిచే కాంగ్రెసునుండి తొలగించబడిన కాంగ్రెసువాదియగు దివాకర పట్నాయకుగారు ఇపుడు గంజాంజిల్లా యుద్ధానుకూల సంఘముపక్షమున ఆజిల్లాలో ప్రచారము చేయుచున్నారు. వారు యుద్ధనిధికి కొంతధనమునుకూడ ఇచ్చినారు.

# దేశరక్షణ నియమాల క్రిందచర్యలు

కమ్యూనిస్టు కరపత్రాలను దగ్గరఉంచుకొన్నారని లాహోరులో కార్మికనాయకులకిద్దరికి చెరిఆరేసి నెలల కఠినశిక్ష ఖైదుశిక్షవిధించబడినది.

అల్మోరాలో రాజద్రోహమునుబోధించెనని, నైనిటాలు జిల్లాకాంగ్రెసు అధ్యక్షుడగు గోవిందరాం శర్మగారిని అరెస్టుచేసినారు. వి. పన్తేగారు రాజద్రోహప్రేరకముగా మాట్లాడినందుకు పూనా మేజస్ట్రేటుగారు వారికి ౧౮ నెలల కఠిన ఖైదుశిక్ష, ౫౦౦ ల జుర్మానా, అదిచెల్లించనిచో ౬ నెలల శిక్షవిధించిరి.

సంయుక్తరాష్ట్రంలో 'నేషనల్ హెరాల్డు' అనే పత్రికలో ప్రకటించదలచిన కీర్తికలన్నిటిని ముందుగా ప్రభుత్వప్రకటనశాఖవారికి చూపవలెనని ఆజ్ఞ గావించబడుటచే యీక మీద కీర్తికలునే పండానే వార్తలను, వ్యాసములను ప్రకటించెదమని ఆపత్రిక మేనేజింగుడైరెక్టరులగు మోహన్లాలు సక్సేనాగారు ప్రకటించినారు.

అమృతసరు కాంగ్రెసు సంఘాధ్యక్షుడగు హాకింసికిందర్ ఖజరుగారు ముల్తానులో రాజద్రోహమును బోధించిరను కారణముచే ఆగస్టు ౨౧వతేదివాడు అరెస్టుచేయబడిరి.

ఢిల్లీరాష్ట్రకాంగ్రెసు సంఘకార్యదర్శి గంగాశరణసింగు, ఢిల్లీ ఫార్వర్డు బ్లాకుసభ్యుడు నవలకిశోరసింగుగార్లు ఇదివరలో రైతులసభలో రాజద్రోహవచనములనుప్యసించిరని అరెస్టుచేయబడిరి.

బెంగాలు ప్రభుత్వమువారు "బోల్షివిక్ పార్టీఇత్తెహాదు" "నేను ఎట్లుతేకుడిదను", మున్నగు ఆయిదుపత్రాలను నిషేధించినారు.

బర్మాలో

బర్మాలోకూడ దేశరక్షణనియమాలక్రింద చర్యలుజరుగుచు నేయున్నవి. పేపములో ప్లీడరుగానున్న బూకా గారిని పోర్టులో బోకరుగాయున్న ధీమతూంగ థీక్ గారిని రంగూను క్రిడంట్లాను కార్యాలయములో ఆగస్టు ౨౧వతేదిని అరెస్టుచేసిరి.

మోకానింగు రచితమైన 'మిస్టీరియస్ ఇండియా' అనునొకపుస్తకపు ప్రతులను, "కమ్యూనిస్టుసోస్లెటర్" అనుపత్రికయొక్క ౧౯౪౦ మే నెల ౭వ, ౧౦వ, ౧౫వ, ౨౦వ, ౨౫వ. ౨౬వ తేదీల వాటినంచికలను బర్మాలోనికి తేగూడదని ఆజ్ఞయైనది.

బర్మా ప్రధాన నగరమగు రంగూనులో "బర్మా వాదు" అనుపత్రికలో "బ్రిటనుపై జర్మనువిమానదాడి" అనిపెద్దఅక్షరములలో ప్రకటించగా, పత్రికసంపాదకుడగు వి. హెచ్. దేవిడుగారికి ఆగస్టు ౨౧వతేది న్యాయస్థానములో రూ. ౧౦౦ రూపాయలు జుర్మానావిధించిరి.

# ఖాక్సారుల లొంగుబాటు

### ఖాక్సారునాయకుని ప్రకటన

"ఇండియాప్రభుత్వమువారి నిషేధాజ్ఞను రాష్ట్రప్రభుత్వము అమలుపరచుసందర్భములలో ఖాక్సారులు యుద్ధముముగియునవరకు, ఆ నిషేధాజ్ఞ నతిక్రమించి సైనికుల లెకవాతుచేయరు. ఖాక్సారులకేగాక అన్ని వాలంటీరులసంస్థలకును సైనికవేషధారణమును ఇండియాప్రభుత్వమువారు నిషేధించినారు, అల్లామాసాహెబ్, దారా అలియాహింది, మదారున్ని జాంగార్లతో కలిసిమాట్లాడి నేనీక్రిందియాజ్ఞను గావించుటకు అధికారముబడసితిని" అనుచు ఖాక్సారునాయకుడగు మియాఅహమ్మద్షాగారు వెల్లూరుజైలులోనున్న ఖాక్సారుఉద్యమనాయకుడగు అల్లామా మష్రికీగారితో మూడురోజులు చర్చించినతరువాత ప్రకటించినారు. ఆప్రకటనలో ఈ క్రిందియాజ్ఞలుగలవు:

౧ ఇండియాప్రభుత్వమువారి నిషేధాజ్ఞను అమలుపరచు రాష్ట్రములలో సైనికులవలె డ్రిల్లుచేయరాదు.

౨ పాదమునకొకసారి సభలు జరుపుకొనుటకుగాని, కుసీకుసుకుపోవుటకుగాని అభ్యంతరములేదు. కాని అట్లుపోవునపుడు సైనిక విన్యాసముల నవలంబించరాదు. సంఘసేవచేయునప్పుడుకూడ ఇట్లే ఆచరించవలెను.

౩ పారలుధరించవచ్చునుగాని వాటితోకవాతుచేయరాదు.

౪ సైనికులవస్త్రమువలె కనపడకుండుటకై ఖాక్సారులు ధరించువస్త్రములలో కొద్దిమార్పులు చేయవలెను. జేబులకు రెక్కలవలె నుండుభాగములను తొలగించవలెను.

ఈదకు అహమ్మద్షాగారు సంయుక్తరాష్ట్రప్రభుత్వమువారితో గావించుకొనినట్టి ఒడంబడిక కే గావించుకొనెదమని తెలిపినారు.

# జీవితేల

## శ్రీ త్రియంబకరావుగారి అష్టావధాన విమర్శకుడు

ది॥౧౯-౮-౪౦ తేదీన గోలకొండ పత్రికలో పయి యవధానవిమర్శనను చూచి విస్మితుడన యితిని. ది॥ ౧౬-౮-౪౦ న నల్లగొండలో సాంగ్రంథమునజరిగిన, యవధాన ప్రారంభమునుండియు సమాప్తమగువరకు, అవధానవిషయములను శ్రద్ధగా గమనించుచుండినవారిలో నేనొకడను. శ్రీ శతావధాని శ్రీపతి త్ర్యంబకరావుగారున్ను, ఈ సత్యనారాయణశాస్త్రిగారున్ను. అవధానప్రయత్నములకయి యొకనాడే నల్లగొండకువచ్చిరి సభనేర్పాటుచేయించిన శ్రీయుతులు పాలరెడ్డిగారు అవధానదినమున నత్యంతావశ్యక కార్యముపై యితరగ్రామమునకు వెళ్లియుండుటచే. సభలో యీశాస్త్రిగారియొక్కయు వీరియభిమానులయొక్కయు ఆటలుసాగినవి,

అవధానిగారు గంటలలో తప్పిరి తక్కినవిషయములన్నియు నతిసమర్థతో సభ్యులకానందమగునట్లుగానొనర్చిరి. అప్రస్తుతప్రసంగము సరసవంతమగు, నాశుకవిత్వమును చెప్పిరి. నిషేధాక్షరికితానుగా పూనుకొనిన యీశాస్త్రిగారు నిషేధించుటలో పప్పులోకాలువేయుటయేగాక అవధానారంభమునుండియు, ననవసరముగా తాను జోక్యముకలిగించుకుని, యవధానిగారిని కృధావాగ్వాదనపడిచి యవధానము భగ్నపరుప యత్నించుట మొదలగు చేష్టల చేయుచునే నుండెను. నిషేధాక్షరి పూర్తికాగానే యీశాస్త్రి నిషేధము నిష్ఫలమయినదన్నాడు. దానికవధానిగారు తుదకర్థముచెప్పెదను. వ్యర్థము గమాటలాడవలదని జవాబుచెప్పితక్కినయవధానమంతయు పూర్తిచేసి, నిషేధాక్షరికి ప్రతిపదార్థము చెప్పిరి. అర్థమునగాని భావమునగాని తావడినదానికి సరిపోలేదని యీశాస్త్రిగారనలేదు. ఆపద్యము నిక్కడవ్రాయుచున్నాను.

| | |
|---|---|
| విషయము:- భారతియుద్ధానంతరం భారతదేశస్థితి- | కం॥ శోకము విడి శ్మశానవిమతస్థైయి కనంగాగని విలాస వంచితగతిదా ప్రాకగ, ధనధారిణి, య త్నాక గడకదక్కనేటి యట్లగనవరజ. |

ఇందులో వివిమత కర్గములేదని యాక్షేపించిన శాస్త్రిగారు దానినిగురించి ప్రతికలో వ్రాయకుండుటయే వారిదుహానుచాటుచున్నది సమస్యలో మరియొక యాక్షేపము, సమస్యాపద్యము,

శా॥ భావంబింతయు చెల్పనైతి కదా ప్రాణప్రదంబైవనీ యీవాసంతిక తోడనైననుచెలీ

యేవానిసేరితిగేరీ వైభోగమునఙ్గరం చితివోమా

లీలన్నిట్లల్ ఉండియే శ్రీబంధవిమోక్షనైతి వెపుడో

నీకేజప్రతేక్షణా

చివరిపాదము సమస్యగానిచ్చిరి. పయిమూడుపాదములు అవధానిగారిచే పూరింపబడినవి అవధానిగారు మూడవపాదమును చెప్పుచు, ఇక్కడ విసంధి. కార్యదోషములలో నొకటియయినను వేయుచున్నాను. అక్కడ విసంధియని వ్రాయమనిచెప్పిరి. సమస్యనిచ్చిన శ్రీజగన్నాథరావుగారు అవధానపద్యములన్నియువ్రాసిన శ్రీ వరసింహాచార్యులుగారు, ప్రత్యేకము పద్యములన్నియు వ్రాసికొనిన నేను యటులనే వ్రాసుకున్నాము-ఈపద్యమునే శాస్త్రిగారు తాము తప్పులకుప్పయనిన్ని గుణములుపోయి నవనిన్ని వ్రాసినాడు! అవధానానంతరము శాస్త్రిగారు లేగి, విసంధినిగూర్చియు, నిషేధాక్షరిలో వివిమత, కర్థములేదనిన్ని యాక్షేపించిరి. అధ్యక్షులు మీరేమి చెప్పుతారని యవధానిగారినడుగగా వారు లేచి, వివిమతయై, యనుపదమునకు విశేషవిరుద్ధమధుదయి యనునర్థమనిన్ని యది ఏకాక్షరి నిఘంటువనగలనియు. విసంధిని తానే విసంధియనిచెప్పి వ్రాయించినప్పుడాక్షేపణకవకాశమే లేదనిన్ని, పూర్వకవులతో కొంత విసంధిదోషమును పాటింపలేదనిన్ని తెలిపిరి. తిరిగి యధ్యక్షులు శాస్త్రివంక చూచి మీరేమిచెప్పుతారుఅనగా ఆయన, తానమాటనిక్కడు మఱి లెక్కచేయలేదనిన్ని యందెక్కడనవిమతయై శేష విరుద్ధమగలదైయె. యనికేనిరు విసంధిక యి విసంధదోషముకానియు గ్రుచ్చు ... విసంధదోషము వర్తించునియు ... తే పూర్వకవులు వాడిరిగాని తక్కినవని యు విసంధులుకావనియు, ... యుచెప్పిరి, అధ్యక్షుడు మీరేమి చెప్పతారు, అని యవధానిగారినడుగగా ఆయన, ఏకాక్షరి నిఘంటువెవ్వరినవో ... యిక సందేహము తీరు

## పల్లెటూరి ప్రజలుకూడ ఆంధ్రులేనా

ఆంధ్రనాయకులకు మొఱ

రాయరావుపేట. జమ్మలపేట మరియు చుట్టుపట్ల గ్రామములెన్నో ఆత్రాపుబల్లాజిల్లాకే సంబంధించినవైయున్నవి. ఈసంవత్సరము సప్తమాంధ్రమహాసభ ముఖ్యముగా ఆత్రాపుబల్లాబీదరైతుల మొరనాలకించుటకై మల్కాపురములో జరుపజడెను. సభమాత్రము నిర్విఘ్నముగా మాడుగోటాలు యథాప్రకారము నడుపబడెను. సభకొరకై యీచిన్న పల్లెటూర్లనుండికూడ యథాశక్తి చందాలొసంగబడెను. విద్యావిహీనులగు మా పల్లెటూరిబీద సాదలకు ఆంధ్రులనవెవరో, ఆంధ్రమహాసభయనవేమిటో అసలే తెలియదు. ఇంతమాత్రము "గోలకొండపత్రిక"యేలేకున్న మాకు "గుడిశెలోయున్న గుడ్డివాని"గతియే పట్టియుండెడిది మహాసభజరిగి యింతవరకు నాల్గుమాసములు గావచ్చెను. కానియింతవరకు మహాసభనాయకులలోనొకరైనను అథవా వారిచేనియమింపబడినప్రచారకులైనను మా పల్లెలలోకి దయచేసి మాస్థితిగతులనడుగువారెవ్వరుగూడ గానరారైరి, "వున్నవాడు వున్నవానికేపెట్టె లేనివారు వున్నవానికేబెట్టె"ననునటుల మా ఆంధ్రనాయకులందరు ఖమ్మము నల్లగొండమున్నగు వ్యాపారస్థలములకేగి యచ్చటిప్రజలలో నేప్రచారముజేసి ప్రజలలో ప్రబోధముగల్గించుచున్నారు యేమియు తెలియని మా పల్లెటూరివాండ్ల నడుగువారెవ్వరు లేరు

మా పల్లెలలో యేమున్నది? తొడుగుటకు మూరెడంతగుడ్డ, త్రాగుటకు చేరెడంత గంజి, ఆ న్యూ మాడల్ మోటారుకార్లు, సిమెంట్ సదనములు, కన్నులకుమిరుమిట్లుగొల్పు విద్యుచ్ఛక్తి దీపములు మున్నగు సౌకర్యములుగలవారలకు, యేఆముదము చమురు దీపములో బెట్టుకొని, గడ్డికప్పుగుడిశెలలోయుండి. రాత్రింబవలు రాళ్ళపొలములలో దిరుగువారము మేముసరియగుమనమా? వాండ్లందరు ఆంధ్రులే, మేము పల్లెటూర్లలోయుండువారము. ఆంధ్రులముకాము. ఎన్ని మొరలు బెట్టుకొన్న నేమిఫలము. మాపల్లెటూరిప్రజల కష్టసుఖములబూచుటకు వాండ్లకేదయగలిగివచ్చి దర్శనమొసగవలెగాని, మేము ఆంధ్రులమో, మరెవ్వరమో, తెలియనప్పుడు మేమేమియు చేయజాలము. ఇకనైన ఆంధ్రనాయకులందరు మాపల్లెటూరి బీద సాదలప్రజల విషయమై యాలోచింతురని మనవి

ఇట్లు
వి. ఎన్. దీనబంధు

---

నవియు, రెండవది సంధిలేకుంటయే, విసంధియను పదమునకర్థమనియు తీరిగి మీరేమిచెప్పెదరు. అని యధ్యక్షుడు శాస్త్రిగారినడుగగా వాదము మీరెంతుతప్పులేయని చెప్పిరి. తిరిగియధ్యక్షుడు అవధానిగారినిచూచి మీరేమి చెప్పుమనగా ఆయనగారులేచి యిప్పటికే మూడుమారులు చెప్పితిని పుస్తకములానావద్దలేవు ఇక్కడతీర్పువాయించవలె తీర్పింపుడు. లేక మీకు సందియమున్న నేపత్రికయయినను వ్రాసికొను.

యధ్యక్షుడు వంత్యవచనములతో సభముగిసెను అధ్యక్షుడు మీదంపిరవభావమునుగూర్చి నేనేమి చెప్పనక్కరలేదు. మీ ంతనేపిక్కడ దయచేసి యున్నందుకు మీకు నానమస్కారములు. అని సభ ముగింపచేసెను

ఇట్లు
జె. యన్. రెడ్డి.

(ఈ చర్చ ఇక్కడికే ముగించుచున్నాము. ప్రతికాంతరములలో సాగించుకోవచ్చును. గో. ప.)



## ఆంధ్రవాఙ్మయ సేవాసమితి

"ప్రమోది"సంపుటి ప్రచురణము---

సభ్యుల కొక విన్నపము

ప్రస్తుతము సమితియందు, మహారాజపోషక రాజపోషక, ప్రధానపోషక, పోషకప్రథమతరగతికి ద్వితీయతరగతులందుజేరిన సభ్యులు ౩౦మందివరకుగలరు. వీరిలో సాహిత్యసేవకులరచనలను ప్రోత్సహించి, గ్రంథస్థమున వెలువరింపజేసి, సమితి ప్రస్తకుకారణభూతులై భాషాభిమానమును వెల్లడించువారలేపెక్కురుగలరు, కిన్నెరసంపుటి వెలువడినపిమ్మట, నూతనరచనోత్సాహకులై సమితియందుమంజరి కార్యకలాపముల జరుపనెంచినవారుకూడ పలుతావులందు బయలుదేరిరి- కాని ఈసభ్యులలో ఈనాలుగేండ్లనుండి వసూలైన చందాలకంటె రావలసిన చందాలు హెచ్చుగి మున్నవి. బూర్గుంపాడు పాల్వంచ ప్రముఖుల విరాళములవలనను, కొన్ని చందాలవసూళ్ళవల్లను సమితివార్షిక సమావేశము ఎట్టెట్టులో జయప్రదముగ నిర్వహింపబడినది, సభ్యులనుండి యెక్కువ చందాలు దిగబడియున్న కారణముననే 'ప్రమోది'సంపుటి వెలువడుట కాలస్యమగుచున్నది సభ్యుల సహాయసంపత్తిపైననే ఈ గ్రంథముపూర్తి కావలయును గాని రచనల పంపినంతమాత్రమున ధనమూలకమగు నీప్రచురణము సకాలములో నిర్వహింపబడలేదనే నిష్ఠురములకు సభ్యులెల్లరు గూడ బాధ్యులుకాగలరనుట నిజము. కావున సమితిసభ్యులెల్లరు తామివ్వవలసియున్న చందాలను ఎంత్వరలోనొసంగిన అంతత్వరలో సంపుటి ప్రచురణముకాగలదని మనవి. సమితి కార్యభారమును పోషకసభ్యులును, సాహిత్య సేవాప్రియులగుసభ్యులును పరికించి తమతమచందాలను, పాల్వంచ టపాఖానాద్వారా నాపేరటగాని, బూర్గుంపాడు టపాఖానాద్వారా సహాయకార్యదర్శులగు శ్రీ దుద్దుకూరి వేంకటప్పయ్యచౌదరిగారిద్వారాగాని, ఖమ్మము టపాఖానాద్వారా సహాయకార్యదర్శులగు శ్రీ బెల్లంకొండచంద్రమౌళిశాస్త్రిగారిద్వారాగాని చెల్లించి తోడ్పడ ప్రార్థితులు. చందాలుచెల్లింపజాలనివారు కార్యదర్శులకు ముందుగ తెలియచేయుటైనను మంచిదని గ్రహింతురుగాక.

పాల్వంచ
8 11-49 } కొ. వెం. రా. ల. నా. శర్మ, కార్యదర్శి.

## బాల్యవివాహ నిషేధ శాసనము

ఒకవిజ్ఞప్తి

అస్మద్దేశీయులారా!

శారదాశాసనము మత చారధర్మములకు విరుద్ధమనియు స్వరాజ్యము వచ్చుటకు మొదటిమెట్టని శారదాశాసనమునుచేయుటకు మొదలుపెట్టిరట. చూచితిరా: యీఅపహాస్యములు అయినను లెక్కచేయక కార్యాచరణకు గడంగుమురని నావిజ్ఞప్తి జీతములతో ప్రతియూరి ప్రచారకులు బయలుదేరినారు. ప్రజలకు దుర్బోధలుచేయుచున్నారు సంతకములపట్టీలు తయారుచేయుచున్నారు. శాసనముగుచో కొంపలుమూలిపోవునట మనపిల్లలను డాక్టర్లు పరీక్షింతురట ఏవేవో అక్రమముమాటలతో సంతకములు తీసుకొనబడుచున్నవి. ఇంతయెందుకు బ్రిటిషు హిందూరాజ్యములో యీ శారదాశాసనమే అమలులోయున్నది. ఎంతమంది కులాచారములు పోయినవి ఈప్రచారకులు కూడా చాలమంది అచటివారేగదా! శాసనమైనాల్గవత్సరములుదాటినవి. ఎవరికులములు వారికేయున్నవి గాన ఓ విజ్ఞానవంతులారా మోసపోకుడి నూరువత్సరములక్రిందట సహగమనము నుమాన్ప యిట్టిశాసనమే ప్రయత్నించినపుడు పరబలులయిచ్చుకాపాలికులును బయలుదేరినపుడున్నూ సనాతనులమని చెప్పు మహానుభావులే అడ్డముతచ్చి వేధించినారు తుదకుఏమయినది. "ధర్మమేవజయతి"గావ ఓ యువకులారా గవర్నమెంటువారు ఏర్పరిచినగడపుదినము. వినాయకచతుర్థియట యింతలో ధైర్యకంకణులై యూరయూరతిరిగి శాసనముములులోకి వచ్చుటకున్యాయమగు దస్కతులు తీసుకొని యీదిగువఅడ్రసు హైదరాబాదు, సంఘసంస్కరణసభా కార్యదర్శిగారికంపుడు ఈ శారదాశాసనము మనదేశనాయకులైన మందుముల నరసింగరావుగారు పాసుచేయించుటకు శాసనసభాఅంగీకారమున పెట్టిరని జ్ఞాపకము చేయుచున్నాను.

ఇట్లు
విధేయుడు
మిర్యాల నారాయణగుప్త
మధిరతాలూకా ఆంధ్రజనసంఘకార్యదర్శి

# నిర్మాణ కార్యక్రమము

## మహాత్మా గాంధీగారు

౧౫వ ఆగస్టు హరిజనపత్రికలోని ప్రధానవ్యాసమందు మహాత్మా గాంధీగారిట్లు వ్రాసినారు.

"దేశనిర్మాణ కార్యక్రమము చాలాగొప్పది, దానిలో యీక్రింది చేరియున్నవి, ౧. హిందూముస్లిం ఐక్యత, ౨. అస్పృశ్యతానివారణము ౩. మద్యనిర్మూలనము, ౪ ఖాదీ, ౫ గ్రామపరిశ్రమలు, ౬ గ్రామ పారిశుద్ధ్యం, ౭ వర్ధావిద్యావిధానము, ౮. వయోజనవిద్య, ౯. స్త్రీసముద్ధరణ, ౧౦. ఆరోగ్యబోధ, ౧౧ రాష్ట్రభాషా పరిచయము, (రాష్ట్రీయుడఖిలదేశమని హిందీలో ప్రయోగింతురు) ౧౨. మాతృభాషాభివృద్ధి, ౧౩. ఆర్థిక సమానత్వ సిద్ధి

ఈపట్టిక ముఖ్యమగువానిని తెలుపుచున్నది, ఈవిషయాలు మనలో లోపించినందున మనము రాజకీయవిముక్తి పొందకపోయినాము, పైప్రణాళికను సాధించితే మనము అహింసామార్గముగా స్వరాజ్యాన్ని సాధింపగలమని అనుకోవలెను.

హిందూముస్లిం ఐక్యతలో సిక్కు, క్రైస్తవ పార్సీల ఐక్యతకూడాచేరినది సర్వజనుల ఐక్యత లేని వ్యక్తిసమూహము ఏమియు సాధించలేదు.

ఎంతవరకైతే అంటరానితనము నేరాపము హిందువులచే ధర్మమును కలుషితముచేయునో అంతవరకుహిందువులందరును పపంచదృష్టిలోఅంటరానివారైయున్నారు. అంటరానివాడు స్వరాజ్యము సాధించలేడు అంటరానితనమును తీసివేయుట అనగా అస్పృశ్యులను తన రక్తసంబంధులవలె చూచుట ఎక్కువతక్కువలను ఎవరున్ను పాటించరాదు అట్టివారికి "వసుధైవ కుటుంబకం"మత్తుపదార్థాలకు గులాములైనవారు స్వరాజ్యాన్ని సాధించలేరు

ఖాదీలేనిది మనదారిద్ర్యసమస్య పరిష్కారముకాదు. ఖాదీ వృద్ధిఅయితే మనగ్రామాలన్ని పునరుద్ధరింపబడును, ఇతరగ్రామ పరిశ్రమలుకూడా వృద్ధికిరావలెను.

గ్రామపారిశుద్ధ్యంలేనంతే గ్రామాలిప్పటివలెనే పెంటకుప్పలుగానుండును అనాదినుండి వచ్చిన మురికితనాన్ని నిర్మూలింపవలెను. గ్రామములలో పాకీపనివరకుకూడా చేయుటకు నేరనటివాడు గ్రామసేవచేయజాలడు.

క్రొత్తవిద్యావిధానములేనిది మనకోట్లజనులకు విద్యరానేరదు గ్రామసేవకులు వయోజనవిద్యను నేర్పుటకున్న సామర్థ్యమును సంపాదించుకోవలెను. స్త్రీలకు సరిసమాన గౌరవమియ్యవలెను.

ఆడుపిల్లపుట్టితే మనవారు సంతోషము ప్రకటించనంతవరకు మనసంఘానికి పక్షవాతమువచ్చినట్లే స్త్రీలను అణచియుంచుట అహింసను నిరాకరించుట ప్రతిస్త్రీని తనతల్లి లేక చెల్లెలివలె చూడవలెను. ఆరోగ్య జనులకు స్వరాజ్యములభింపదు. ప్రతివ్యక్తి తనశరీరానికి ఆరోగ్యసూత్రాలు తెలిసియుండవలెను. అందరికిని అర్థమగు దేశభాషలేనిది జాతీయఐక్యత కానేరదు. హిందీ హిందూస్తానీ, ఉర్దూఅను పదాలపై తగవు మనకు పనికిరాదు. మనకు కావలసినది హిందువులను ముసల్మానులను సరిసమానంగా అర్థముచేసుకోగలిగిన రాష్ట్రభాష.

ఇంగ్లీషు వ్యామోహములోపడి మనము మన మాతృభాషలకు ద్రోహముచేయుచున్నాము. దీనికి ప్రాయశ్చిత్తము పెట్టుకోవలెను మనభావల ప్రేమించవలెను.

ప్రతివానికిని సంపాదించుటకు మంచిపని కట్టుటకు మంచిభోజనము కట్టుటకు పరిశుభ్రమైన ఖాదీ ఉండుటయే ఆర్థిక సమానత్వము.

—



# ఆంధ్ర విద్యాపీఠానికి ప.మ.వ. నిజాంప్రభువుగారి విరాళము

వాల్తేరు, అగస్టు ౧౫

ఆంధ్రవిశ్వవిద్యాలయపు రిజిస్ట్రారుగారు ఇట్లు ప్రకటించినారు.

ఓ. సి. గంగోలీగారు ఆంధ్రశిల్పమునుగూర్చి రచించిన గ్రంథమును ఆంధ్ర విశ్వవిద్యాలయము వారు అచ్చువేయించుచున్నారు. ఈగ్రంథము అనేకచిత్రములుగలిగియుండును,

ఈగ్రంథప్రకటనకగు ఖర్చులు ఆంధ్రవిశ్వవిద్యాలయము భరించగల స్థితిలో లేనందున, వైస్ ఛాన్సెలరుగారు నిజాంగారి సహాయము కోరిరి.

నిజాంప్రభుత్వమువారు కావలసినంత సహాయముచేయుటకు ఉదారముగా అంగీకరించినారు. నిజాంప్రభుత్వమువారి ప్రెస్సులో పుస్తకము అచ్చువేయించుటకు బ్లాకులు తయారుచేయించుటకు, చక్కని ఆర్టుపేపరుపై బొమ్మలు ముద్రించుటకు అంగీకరించి, ఇవిగాక ఇతరఖర్చులనిమిత్తము ౨౦౦౦ రూపాయీలను విరాళముగా ఇచ్చినారు.

నిజాంప్రభుత్వమువారి యింత గొప్పవిరాళమును ఆంధ్రయూనివర్సిటీ సిండికేటువారు అత్యధిక ఆదరణతో స్వీకరించినారు

ఆంధ్ర, ఉస్మానియా యూనివర్సిటీల సంయుక్త యాజమాన్యముక్రింద ఈగ్రంథము అచ్చగును, కాని సర్వహక్కులును గ్రంథములును ఆంధ్రవిశ్వవిద్యాలయమునకేఉండును.

నిజాంప్రభుత్వాధ్యక్షుడు రైట్ ఆనరబిల్ సర్ అక్బర్ హైదరీగారు విద్యాశాఖసభ్యుడు ఆనరబిల్ మెహదియార్జంగ్ బహద్దరుగారు యింకను నిజాంప్రభుత్వసభ్యులు వీరలపట్ల ఆంధ్ర యూనివర్సిటీ వైస్ ఛాన్సెలరు సిండికేటూ తమ కృతజ్ఞతావందనములు తెలుపుచున్నారు.

—

# కాంగ్రెసు కార్యవర్గ సమావేశం

అగస్టు౧౭వతేదీ కాంగ్రెసు కార్యసంఘము వర్ధాలో మధ్యాహ్నము ౨గంటలకు సమావేశమయినది. వరుసగా ౬గంటలకాలము చర్చలు సాగించినది.

మౌలానా అబుల్ కలాంఆజాదు, సర్దారువల్లభాయిపటేలు, సి. రాజగోపాలాచారి, భూలాభాయిదేశాయి పండిత జవహర్ లాల్ నెహ్రూ శ్రీమతిసరోజనీదేవి. డాక్టర్ రాజేంద్రప్రసాదు, సేట్ జమ్నాలాల్ బజాజు, గోవిందవల్లభపంత్. ఆచార్యకృపాలినీ, శంకరరావుదేవ, డాక్టరు ప్రఫుల్లచంద్రఘోష్. అసఫ్ అలీ, డాక్టర్ సయ్యదుఅహ్మదు, డాక్టరు పట్టాభిసీతారామయ్యగార్లు వర్కింగుకమిటీ సభకువచ్చినారు. వీరిలో కొందరు సభకు ప్రత్యేకాహ్వానముపై వచ్చియున్నారు.

సభవారు వైస్రాయిప్రకటనమునుగురించి కామన్సుసభలో భారతదేశ సమస్యపైజరిగినచర్చల గురించి జాగ్రత్తగా ఆలోచించుకున్నారు.

వాలంటీర్లసంస్థలపై ప్రభుత్వమువారు నిషేధాజ్ఞలను కావించియున్నారు కానియీ నిషేధప్రయోగము ఏఏపరిస్థితులలో జరుగునో ప్రభుత్వప్రకటన స్పష్టముగా సూచించుటలేదని కార్యసంఘ సభ్యులు అభిప్రాయపడుచున్నారు. ఈ ప్రభుత్వ ప్రకటన కాంగ్రెసు వాలంటీర్ల సంస్థలను ఎంతవరకు బాధిస్తుందో ఆ విషయాన్ని మాత్రము వారుఆలోచించి. అందుకు తగినవిబంధనలను కాంగ్రెసు వాలంటీరు సంస్థలకు తెలియపరచెదరట

పూనాలో కార్యవర్గసమావేశము జరిగినతరువాత దేశములో అంతర్వివాదాలు ఏవిఉన్నను అవి అన్నీ, యిటీవల వైస్రాయికావించిన ప్రకటనకు ప్రతిఫలముగా అంతరించిపోగలవని సభ్యులు అభిప్రాయ పడుచున్నారు. కొంతకాలంగా గాంధిగారు కాంగ్రెసునుండి వేరుపడిఉన్నారు. ఇకను తిరిగి వారు కాంగ్రెసులో స్థానమును స్వీకరించగలుగుదురని సభ్యులు అభిప్రాయపడుచున్నారు. ఇకమీదట కాంగ్రెసుసైకోను చర్య గాంధిమహాత్ముని సలహామీదనే ఆధారపడి ఉండునని సభ్యులు అభిప్రాయపడుచున్నారు.

కాంగ్రెసుకార్యసంఘము అగస్టు౨౫వతేదీ సమావేశమై వైస్రాయిప్రకటనపై చర్చజరిపినది సభ్యులు యీనాగ్ఫుల ధోరణినిగూర్చి బయటికేమీ తెలియబరచుటలేదు కాని,రాజకీయవర్గాలవారు కార్యసంఘము ఢిల్లీతీర్మానములో ప్రకటించినకోర్కెలను వైస్రాయిప్రకటన తృప్తిపరచుటలేదనుఅభిప్రాయము ప్రకటించుచు అవసరమైనప్పుడు ఇంకను సంప్రతింపులకు అవకాశమున్నదని అభిప్రాయపడుచున్నారు.

—

# గోలకొండ డైరీ సిద్ధం అయింది

బైండులో ఉన్నది
దానిలోని విశేషాలేమంటే?

౧. ఉర్దూడైరీలకంటే చౌక. మంచి గ్లేజుకాగితాలమీద అచ్చైంది. సాధారణముగా యితర డైరీలసైజు ౩ x ౫ అంగుళాలు. ప్రతి ౧కి రు ౧-౦-౦ ఖరీదు. మా డైరీ అంతకన్న పెద్దది. సైజు ౪ x ౫ ½ అంగుళాలు. ఖరీదు ౧౨ అణాలు అనగా ఉర్దూడైరీకన్న పెద్దది. ధరలో దానికన్న నాలుగు అణాలు తక్కువ.

౨. ఉర్దూడైరీలలో ఆరంభంలో కొన్నివిషయాలు వ్రాయుచుందురు. అవి కేవలం ఖానూనీ విషయాలు. అవికూడా ౪౦ లేక ౫౦ పుటలకన్న ఎక్కువ ఉండవు. మా డైరీలో ౧౫౦ పుటల విషయాలున్నవి.

౩. ఈ ౧౫౦ పుటలలోని విషయాలేవంటే— శకాలు, చక్రవర్తి, రాజుల, యువరాజుల బిరుదులు, నిజాంరాష్ట్రచరిత్ర, జనాభా పట్టీలు, జిల్లాలు, తాలూకాలు, శాసనసభ- ఇప్పటిది- ముందు రానున్నది- బాబెహుకూమతు శాఖలు— వాటిక్రింది కచ్చేరీలు, సుంకముల ధరలు, మొగలాయి టప్పా, ఇంగ్లీషుటప్పా, తంతీవివరాలు, రాష్ట్రములోని చారిత్రికస్థలాలు, జాగీర్లవివరాలు, సర్ఫెఖాసు, బాబెహుకూమతు సభ్యులు, పటేలుపట్వారీల స్కేళ్ళు, రైతులహక్కులు, రైతులఅధికారాలు, పట్టాదారులు, జమాబందీ ముఖ్యవిషయాలు, భూమిపన్నులు, అధికారుల చర్యలు వర్తకసంబంధాజ్ఞలు, న్యాయస్థానరుసుములు, స్టాంపు శాసనములోని ముఖ్యవిషయాలు, వెట్టిచాకిరి, దేశీరాజుల గౌరవార్థపు తోపుకాల్పులు, రాష్ట్రపత్రికలు. విజ్ఞానవిషయాలు, (ప్రపంచచిత్రాలు) సర్కారీ సెలవుదినాలపట్టీ, జాగీరు రైతుల హక్కులు, పంచాంగం పీఠిక, హిందువుల పండుగల పట్టీ, కార్తులపట్టీ, పూర్తి పంచాంగం ఇవన్నీ కాకుండా ఉర్దూలిపిభాషలోనే వకీళ్ళకు పనికివచ్చే నమూనా ఫారములు, నకలు, దరఖాస్తులు, హలఫ్నామా తామీలు మున్నగు ఫారములు కూడా ముద్రించి చేర్చినాము.

ఇవి యీ డైరీలోని విశేషాలు. రైతులహక్కులు, అధికారాలు, జాగీరు రైతుల అధికారాలు, జమాబందీ— మున్నగు ఖానూను సంబంధమగు విషయాలు విపులముగా సర్క్యులర్లు, మురాసిలా, నజాయర్లు, ఖానూనుల హవాలాలతో వ్రాయబడియున్నవి— తర్వాత ౩౬౫ దినాలకుగాను ౩౬౫పుటలను ఏర్పాటుచేసినాను. ప్రతి పుటపైన ఈస్వీ, శకము, ఫసలీ, హిజిరీ — నాలుగు తేదీలిచ్చియున్నాము. ఈడైరీ యితరడైరీలకన్న ఏవిధంగా లోపించిందో ఎవరైనా చెప్పగలరా? కేవలము ౧౫౦ పుటల పీఠికాభాగానికే ఈ డైరీ వెలయిచ్చికొనవచ్చును. అట్టిచో ఆంధ్రులకొరకై ఇంతటి విశేషాలతో, ఇంతశ్రమతో, ఇంతఅగ్గువగా మేమీడైరీని సిద్ధం చేసినామను విషయాన్ని ప్రత్యాంధ్రుడున్ను జ్ఞాపకం ఉంచుకోవలెను.

ఒక్కనెలలోనే ప్రతులన్నీ అమ్ముడుపోతే ఆశ్చర్యంకాదు. కావున అభిలాషులు వెంటనే తెప్పించుకోగలరు.

డైరీవెల చందాదారులకు క్యాలికో బైండుది
౧౨ అణాలు మాత్రమే.
ఇతరులకు ౧౪ అణాలు.
చర్మపువీపు మూలలు గలది- రు ౧
పూర్తిచర్మముగలది రు ౨
పూర్తిచర్మముది ఆర్డరుపైననే తయారు చేయబడును-
క్యాలికోబైండు- గ్లేజుకాగితాలు-
మేనేజరు గోలకొండపత్రిక,
హైద్రాబాదు-దక్కన్ అనివ్రాసి తెప్పించుకోగలరు.

# ఇష్టాగోష్ఠి

——ఆంగీరసుడు

## హిందూమహాసభా నిర్మాణము

హిందూమహాసభా నిర్మాణమునుగురించి కొన్నివివరములను తెలిసికొనుట మంచిది. ౧౯౧౫ సం॥వరకు భారతవర్షములో "మహమ్మదీయ విద్యాసంఘము" పనిచేయుచుండెను. అంటే ౧౯౧౫ నాటికి అదొక్కటే మహమ్మదీయులకు ప్రజాసంస్థ. కాని ఆసంవత్సరములో బ్రిటిషు అధికారుల ప్రోత్సాహమున ముసల్మానులకొక రాజకీయసంస్థ ప్రారంభింపబడెను. అదియే భారతముస్లింలీగు. ఒక సంవత్సరమునకు జిన్నా సాహేబు కీ॥ శే॥ మౌలానా మహమ్మదలీ గార్ల ముఖ్య పోటీప్రబలెను. ఇంతలో ౧౯౧౯లో గాంధిగారు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించుట పంజాబుహత్యలు సహాయ నిరాకరణోద్యమము బయలుదేరుటజరిగెను. తుర్కీలో ఖలీఫాను రాజ్యమునుండి తొలగించిరి. సహాయ నిరాకరణమునకు పంజాబుహత్య లొకసమస్యయనుట సమంజసమే. కానిఎచటనో తుర్కీలో ఖలీఫాను పదభ్రష్టత్వముజరిగినదని గాంధిగారు ఇండియా స్వరాజ్యసంపాదన కార్యక్రమములో సమస్యగాచేసెను. దీ వలన మహమ్మదీయులను కాంగ్రెసులోనికి ఆకర్షింపవచ్చునని అసలుయోచన, ఖిలాఫతుసమస్య కాంగ్రెసుతో చేర్చబడగానే వేలాదిమహమ్మదీయులు సత్యాగ్రహోద్యమములో చేరి కారాగారములకేగిరి. మౌలానాలైన మహమ్మదలీ షౌకతలీగార్లు ప్రధాన నాయకులై గాంధీనియనుసరించిరి. ఒకసారి షౌకతలీతాను గాంధీగుడ్డిశిష్యుడనని బ్రహగల్భములు కొట్టెను. సత్యాగ్రహోద్యమము నడచినంతకాలము ముస్లింలీగునడక మందముగా యుండెను.

నిరాకరణోద్యమము ఆగిపోయెను. మౌలానాలుయిద్దరు కాంగ్రెసునుండి వెనుకకు తగ్గజొచ్చిరి. అంటేవారుభయులు దేశనాయకత్వముకొరకు కాంగ్రెసులో చేరిరన్నమాట. ముల్తానులో హిందూ-మహమ్మదీయకొట్లాటఘోరముగ జరిగెను. అప్పుడు కాంగ్రెసు తరపున మహాత్మగాంధి, మౌలానా షౌకతలీలు విచారణకర్తలుగా వెడలిరి. విచారణ పూర్తియైనపిమ్మట తీర్పునుగురించి షౌకతలీ గాంధిని హిందూపక్షపాతియనినిందించెను. కాకినాడకాంగ్రెసులో అధ్యక్షతవహించిన మౌలానామహమ్మదలీ అపురపాలకసంఘ సన్మానమునకు సమాధానమిచ్చుచు తానుమొదట మహమ్మదీయుడననియు తర్వాత భారతీయుడననియు చెప్పెను. అపుడు దేశబంధుచిత్తరంజనదాసు మహమ్మదలీని మందలించెను. క్రమక్రమముగ కాంగ్రెసులో మహమ్మదీయులసంఖ్యసన్నగిలెను. నామమాత్రముగ కొందరు ముసల్మాను నాయకులు మరికొందరు (స్వల్పసంఖ్య)అనుచరులు మిగిలిరి. కాంగ్రెసు మహమ్మదీయుల నాకర్షించు వ్యూహము చెదరిపోయెను. నానాటికి ముస్లింలీగు బలపడుచు వచ్చెను. బ్రిటిషు ప్రభుత్వమువారి పరోక్షసహాయము సానుభూతి మహమ్మదీయులపై యుండగా వారిలీగు వృద్ధిపొందకయుండునా! విభజించి పాలించుమనువానను ఇండియాలో తొలుత నుండివచ్చుచున్న రాజనీతి

ఇట్టిపరిస్థితులలో పూజ్యులైన కీ॥ శే॥ స్వామి శ్రద్ధానందులవారు, పండిత మదనమోహనమాలవ్య, లాలాలజపత్రాయిమున్నగువారు దీర్ఘముగ యోచించి ౧౯౨౩ ప్రాంతమున హిందూమహాసభను నిర్మాణముచేసిరి. సహాయనిరాకరణోద్యమములోనికి ఖిలాఫతుసమస్య తీసికొనిరావలదని లజపత్రాయి గాంధితో తీవ్రముగ వాదించి పోట్లాడెను. తుర్కీలో ఖలీఫా పదభ్రష్టత్వమునకును ఇండియాలో స్వరాజ్యోద్యమమునకును సంబంధమెంతమాత్రమును లేదనెను. ఖలీఫాపై మతసానుభూతి కనబరచెదమనియు అది తీర్మానరూపమున చాలుననియు లాలాజీ శెలవిచ్చెను. వెర్రిగాంధీ తనపట్టుదల వీడలేదు, హిందూదేశ ముసల్మానులందరును స్థిరముగ కాంగ్రెసుననుసరించెదరని భ్రమపడెను. చివరకు లాలాజీ దూరదృష్టియే బోధిగా పరిణమించెను. హిందూమహాసభ సంకుచితభావములతో జాతీయ దృష్టితో స్థాపింపబడెను. శ్రద్ధానందుడు, మాలవ్యా లజపత్రాయలు చేరినసంస్థ, విశాలజాతీయభావములతో నుండక మరెట్లుండగలదు? హిందూమహాసభ క్రిమాభివృద్ధినొందజొచ్చెను. ఆనే, మూంజే సేలం విజయరాఘవాచార్య (ఒకసారి కాంగ్రెసు ప్రసిడెంటు) ప్రఫుల్లచంద్రరాయి, రామానందఛటర్జీ, వినాయకదామోదరసావర్కారు, ఉన్నవ లక్ష్మీనారాయణ (గుంటూరు)వంటి మహామహులు హిందూ మహాసభా నాయకులైరి. హిందూమహాసభా తీర్మానములు భారతజాతీయాభివృద్ధికెప్పుడు ఆటంకము కాకుండనుండు పద్ధతిపై చేయుచున్నామనిపదేపదే హిందూసభా నాయకులు ప్రకటించుచు వచ్చిరి.

అయితే హిందూమహాసభను"కులతత్వసభ" యని ఎందుకు పిలువవలె? హిందూమహాసభకు పలుకుబడి తక్కువగానుండుటకు కారణమేమి?_ యివిరెండును ముఖ్యప్రశ్నలు. కాంగ్రెసులో మూడువంతుల మహాప్రతికజనం హిందువులేనని మరచిపోరాదు, కాంగ్రెసుకు మహమ్మదీయులతో పలుకుబడి నాయకత్వము నామమాత్రమనీ జ్ఞాపకముంచుకొనవలెను. జిన్నాసాహేబు కాంగ్రెసు హిందూసంస్థయని తేలికచేసెను. బ్రిటిషువారు కాంగ్రెసు లోకపార్టీ (రాజకీయపక్షముగా)పిలుచుచుందురు. రాజకీయ సమస్యలాలోచించవలసినపుడు వైస్రాయ కాంగ్రెసుతరపున గాంధీని, ముస్లింలీగుతరపున జిన్నాను పిలుచుచుండును. "మీలోమీరు రాజీపడండి"అనగానే కులతత్వసభయైన ముస్లింలీగుతో కాంగ్రెసు రాజీమాటలు. ఢిల్లీలో గాంధిబసకు మాట్లాడుటకై రమ్మని అయూరిలోనేయున్న జిన్నాకు మోటరుపంపగా జిన్నా రానిరాకరించెను. మరునాడు గాంధియే జిన్నాబసకుపోయి సంప్రతించెను. ఈవిధముగయుండియు పదేపదే కాంగ్రెసునాయకులు హిందూమహాసభను తేలికచేయుచుండుట ఆక్షేపించుచుండుట జరుగుచు చున్నది.

హిందూమహాసభవారితో ఎన్నడూ రాజకీయ సంప్రతింపులు చేయుటలేదు. ఏరాజనీతిమాత్రముతో కాంగ్రెసువారు హిందూసభనునిందించి ముస్లింలీగును ఆలింగనము చేయుచున్నదో బోధపడుటలేదు. హిందువులు అత్యధిక సంఖ్యాకులు జాతీయభావముతో నుండుటయే హిందూ మహాసభకు పలుకుబడి తక్కువగానుండుటకు ముఖ్యకారణము.

ఒకసారి గుంటూరులో డాక్టరుమూంజీ గారు మాట్లాడుచూ ఇండియాలో జాతీయమహమ్మదీయుని చూపించండి యని ప్రశ్నచేసి ఒక్కసర్ అలీఇమామ్ గారు జాతీయభావములు కలవారనిరి. లండనులో రౌండుటేబిల్ కాన్ఫరెన్సు జరిగినప్పుడు సర్ అలీఇమామ్ గారొక్కరే "జాతీయ మహమ్మదీయులతరఫున వాప్రకటన ఒకటియున్నది"అని సాహసముతో చెప్పెననిరి. అపుడు బ్రిటిషుప్రధాని మాక్డనాల్డుగారు సర్. అలీని వినిపించుకొనక మరొకవిషయమునకు వెళ్లెననిరి. డాక్టరు అన్సారీగారు గాంధిగారి కుడిభుజమని చెప్పబడుచుండిరి. అట్టి అన్సారీగారు మాక్డనాల్డు కమ్యూనల్ అవార్డు (కులప్రాతినిధ్యతీర్పు) యివ్వగనే కాంగ్రెసునాయకులందరకు ఆతీర్పు చాల అసంతృప్తికరముగ నున్నది దానిని నిరాకరింపవలెనని అభిప్రాయపడిరి.

అన్సారీ కమ్యూనల్ అవార్డును నిరాకరించవ తాను కాంగ్రెసునుండి విరమించెదనని బెదరించెను. అపుడు గాంధి కాంగ్రెసుతీర్మానమును "అవార్డును కాంగ్రెసు అంగీకరింపదు_ నిరాకరింపదు" అని చేయించెను. దానిపై హిందూసభానాయకులు కాంగ్రెసునాయకులకు ధైర్యములేకపోయెనని ఆక్షేపణలుగావించిరి. వెంటనేజరిగి శాసనసభా ఎన్నికలలో బెంగాలు పంజాబురాష్ట్రములలో హిందూమహాసభా ప్రతినిధులత్యధికులుగా వచ్చిరి కాంగ్రెసు అభ్యర్థులు ఓడిపోయిరి. హిందూదేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము కావలెనని ప్రబోధముచేసిన మౌలానా హజరత్ మొహాని కాంగ్రెసులోనుండి లీగులోనికివెళ్ళిపోయెను (యీముస్లీము వదలెనట) మౌలానా అబ్దుల్ కలామ్ అజాదుగారయినను ఒకానొకసారి ఇండియా రెండుగా విభజింపవలెననియేమని అభిప్రాయము నిచ్చియుండెను కాంగ్రెసువారిలో ధారాళముగ యవనులు నుమున్నారు. క్రమేణ వివరాలు ప్రచురింపబడకమానవు. హిందూసభలో జాతీయవాదికాని వానిని చూపించండి వీరసావర్కార్ ఎట్టి జాతీయవాదియో వర్ణించుట కెవరితరము? లాలాజీ మాలవ్యాలను కాదనుటకు బ్రహ్మకైనను శక్యమా?

ముస్లింలీగుకును హిందూమహాసభకును సామీప్యత కలుగుచున్నట్లు వినబడుచున్నది. అనధ్య సావర్కారు___ జిన్నా సంప్రతింపులు జరుగునని పత్రికలలో చూచితిమి. జిన్నా కాంగ్రెసుమీద ద్వజమెత్తనట్లు హిందూసభమీద ఏతిరోపణలు చేయుటలేదు. కాంగ్రెసు యింకాపట్టుదలవహించుచో హిందూసభ_లీగుసంభాషణలుజరిగి వారుభయుల సమాధానముతో జాతీయ ప్రభుత్వమేర్పడవచ్చును, అందుచేతనే రాజాజీ "జాతీయప్రభుత్వమో"యని గోలచేయుచున్నాడు. జాతీయప్రభుత్వమంటె కాంగ్రెసు ముస్లింలీగు-హిందూసభ__సిక్కుసభ__క్రైస్తవసభాయీ వారందరి ప్రాతినిధ్యముకల మంత్రులతో ఇండియా ప్రభుత్వనిర్మాణము చేయుటకాకపోయినను రేపైనను కాంగ్రెసు హిందూమహాసభతో సమాధానపడితీరవలెను రాజకీయములలో సమాధానపడుట (రాజీ) నిత్యమైనదని చరిత్రలు చెప్పుచున్నవి

ఆజ్ఞతో ప్రకటించుట (Demand) ప్రార్థనతో ప్రాధేయపడుట (Request)_ను ఏమిటి తేడాయనుగుర్తింపవలెను ఒకడుపలుకుబడికలిగి నాయకత్వముతో పెద్దఅచరవర్గమున్నవాడు అడిగినదానిని "డిమాండు" అంటారు అనుచరులు లేక ఒంటరిగానున్నవాడడిగినది "రిక్వెస్టు" అంటారు 1919_20లో అతిబలహీనముగనున్న ముస్లింలీగు యీనాడు బలవత్తరముగనున్నది అందుకనియే కాంగ్రెసు-లీగురాజీసంభాషణలలో జిన్నాసాహేబు "లీగుమహమ్మదీయ ప్రజకు ప్రధానప్రాతినిధ్యసభ"యని అంగీకరించినమీదటనే అసలుసమాధానపుమాటలు ప్రారంభమగునని ఖచితముగచెప్పెను. అపుడు కాంగ్రెసు నాయకులందులకంగీకారము మాపుచున్నటుల పత్రికలలో చూచితిమి. నానాటికి హిందూమహాసభశాఖలను అన్నిరాష్ట్రములలోను వ్యాపించుచున్నది. పదేండ్లనాటికి హిందూమహాసభ జరిగెను. ఆ ప్రాంతములలోకూడశాఖ ఏర్పడుచున్నది హైదరాబాదు రాజ్యమునకు మొన్న మహాసభ జరిగెను షోలాపూరు చిన్న సమావేశముగా జరిగిన హైదరాబాదు హిందూమహాసభ ఆరాష్ట్రములో పెద్దసంచలనమే ప్రజాభిమానము ఏర్పడినకొలది హైదరాబాదు ప్రభుత్వమువారు ఆహైదరాబాదు హిందూసభను ప్రజాప్రాతినిధ్యసభగా నంగీకరింపవచ్చును సర్ అక్బరుగారు మరొకసారి హిందూసభానాయకుని ఆహ్వానించి రాజకీయ సమస్యలను వారితో విత్కరింపవచ్చును ఇవన్నియు అసంగతవిషయములుకావు. ఈనాడు హిందూ ప్రజామండలిపై కొందరు మితవాదులు నూరినవారు ఆకోపముగ నిర్మాంతపడక మానరు ఉద్రేకములేక హిందూప్రజామండలి కార్యక్రమమును గమనించుచుండుట వివేకము

అసలు హిందూ_ముసల్మాన్ వివాదము ప్రజాసామాన్యముతోను కొందరు పెద్దనాయకులలోను లేనేలేదు. దానికిఎన్నియో పెద్ద ఉదాహరణలు చూపవచ్చును. శ్రీనిజాంప్రభువువారు శ్రీభద్రాచల దేవాలయవిచారణకర్తలగుట ప్రధానసందర్భము. సర్. అక్బరుహైదరీగారు వారిసతీమణితోకూడ పుదుచేరివెళ్లి శ్రీఅరవింద యోగిని దర్శించుచుందురు. తూర్పుగోదావరి జిల్లా అమున్నాపురం తాలూకా కొత్తలంకలో ఒకమహమ్మదీయుడొకని చేతిగ్రామమువు చేసిరు చుముకు. మొన్ననే శ్రీసాంబమూర్తిగారు సందర్శించిరి పిఠాపురం నివాసి ఉమర్ అలీషాకవి (భారత శాసనసభ్యులు)గారి తండ్రిగారిని కవిగారినిమాడ వందలాది హిందుశిష్యులు వేదాంత విషయములపై ఆశ్రయించుచుందురు. ఆయూచోట్లవారు హిందూవులనివారు ముసల్మానులని మీమాంసపడెదరా?

అట్లే రాజకీయములలోకూడ జిన్నావంటి ప్రధాననాయకులు సర్ అలీఇమాము ఆదర్శముగాపెట్టుకొని విశాలజాతీయభావములతో హిందూమహమ్మదీయసమస్య స్థిరముగపరిష్కరించుట సర్వవిధములశ్రేయోదాయకము.

## మీ స్వవిషయసమస్యలన్నియు పరిష్కారం కావలెనంటే!

## అమోఘంగా పనిచేయు

## ఈ దివ్యౌషధములను ఉపయోగించండి.

మాకు చేరిన వేలకొలది ప్రశంసాపత్రములే వాటి పూచీని నిరూపించుచున్నవి.

| | | |
|---|---|---|
| జిన్‌సిన్ బంగారు మాత్రలు - బలమునకు శక్తికి అమోఘమైనది ... | ధర రు. | 4-0 |
| సుఇఫాస్‌సి (ద్రవము) - వీర్యస్తంభనమునకు దివ్యౌషధము .. | ,, | 6-0 |
| మలాం - (పై పూతకు) నరబలహీనత్వమును పోగొట్టి పటుత్వమును నొసగును... | ,, | 5-0 |
| చిపాలూం (పేస్టు) - ఒంట జతించిన గనేరియాకు దివ్యౌషధము .. | ,, | 4-0 |
| పాలూంయన్ (కాప్స్యూల్సు) - తీవ్రగనేరియాకు మూత్రకోశపు జబ్బులకు దివ్యౌషధము | ,, | 3-0 |
| చిమాయ్‌డక్ (మిశ్రమము) - అన్ని సుఖరోగములకు దివ్యౌషధము ... | ,, | 3-0 |
| పాక్‌టాయ్‌యస్ (పైపూతకు) - కురుపురోగమునకు దివ్యౌషధము ... | ,, | 2-8 |
| చికింగ్‌కి - స్త్రీల ముట్టుకడుపునొప్పులకు, తదితర జబ్బులకు మాత్రలు ... | ,, | 3-8 |
| చిట్‌యక్‌టాన్ - సంతాననిరోధమునకు యెట్టి అపాయము కలుగకుండా వాడవచ్చును | ,, | 4-0 |
| చిలన్‌పీన్ - తామరకు దివ్యౌషధము, గాయముగాని, మచ్చలుగాని పడవు | ,, | 0-12 |
| సప్‌చాన్‌కో - యెగ్జిమాకు దివ్యౌషధము (ఇతరులకు అంటుకొనదు) ... | ,, | 1-0 |
| ఇహాంగ్ పోసెన్ (మిశ్రమము) - పసిబిడ్డలకు గొప్ప బలవర్ధకౌషధము. మంచి ఆరోగ్యము నొసగును | | 1-0 |
| చీకో - రక్తము వచ్చుచున్నను రాకున్నను మూలశంకకు దివ్యౌషధము ... | ,, | 1-8 |
| హాచన్‌యన్ (మాత్రలు) - మాలికలచే తయారుచేయబడినరిఉబ్బసమునకు అద్భుతముగ పనిచేయును | | 2-8 |
| హాచన్‌యిప్ - ఉబ్బసమునకు ఔషధయుక్తమైన అగులుపీల్చినవెంటనే శ్వాస తగ్గించును | ,, | 1-0 |
| సాయ్‌యర్ (మాత్రలు) - మలబద్ధకమునకు దివ్యౌషధము. అజీర్తికి, ప్రేగుజబ్బులకు ఉపయోగపడును | | 0-12 |
| ఖాట్‌-యర్ (మాత్రలు) - దగ్గులకు, రొమ్మునొప్పికి, రొంపకు దివ్యౌషధము | ,, | 1-0 |
| చిఫంగ్‌సప్ - కీళ్లనొప్పులకు దివ్యౌషధము యెముకల నొప్పులకు ఉపయోగపడును | ,, | 14-0 |

పోస్టేజి ప్రతి పార్సెలుకు అ 8 లు ప్రత్యేకము.

ఉచితము:-శరీర ఆరోగ్యమునకు సంబంధించినవిషయము లన్నియు చిత్రపటములతో సహా పొందుపరుపబడిన మా 44 పేజీల క్యాటలాగున్నూ మీస్వంతభాషలో నొక క్యాటలాగున్నూ, మాకు వ్రాసిన వెంటనే ఉచితముగా పంపబడును, 16 సి. యం యస్. ప్రక్రియలు పూర్తివివరములతో వ్రాయబడినవి.

సి. యం. యస్. ఔషధము లన్నియు క్రొత్తవి సీలువేసి, బాగుగా ప్యాకింగు చేయబడిన స్థితిలో మా సోల్ సెల్లింగు యేజెంట్ల వద్ద నున్న ధరలపట్టీ ననుసరించి అమ్మబడును:—

డి. జె. పారేఖ్ అండ్ కో., హైదరాబాదు అండ్ శికింద్రాబాదు:

జె. బాలాభాయి అండ్ కో., 260, చైనాబజారు రోడ్, మద్రాసు.

ప్రాణలాల్ అండ్ సన్సు, 51, ఆర్కాట్ శ్రీనివాసాచార్ స్ట్రీటు, బెంగుళూరు సిటీ.

చైనీసు మెడికల్ స్టోర్ (స్థాపితము 1930)

హెడ్ ఆఫీసు:—28, అపోలో స్ట్రీట్, ఫోర్టు, బొంబాయి, బ్రాంచీలు:—అహమ్మదాబాదు, ఢిల్లీ, మరియు కలకత్తా.

## జాగీరు ప్రజాసంఘము

హైదరాబాదు(దక్కన్), మెహరు౧౭

శ్రీ కొండా వేంకటరంగారెడ్డి గారిట్లు తెలుపుచున్నారు

జాగీరు ప్రజాసంఘకార్యాలయము హైదరాబాదునగరములో ఫీల్ఖానాలో శ్రీసదనములో ఏర్పాటుచేయబడియున్నది. ప్రభుత్వపు సెలవు దినాలలోతప్ప తక్కినదినాలలో ప్రతిదినం సాయంత్రము ౫గంటలనుండి ౭ గంటలవరకు కార్యాలయము తెరువబడియుండును. అవసరముండువారు సమయములో అచ్చటికివచ్చి విచారించుకొనవచ్చును, ఉత్తరప్రత్యుత్తరాలను పైవిలాసములో కార్యదర్శిగారిపేర వ్రాయవలెను.

సంవత్సరము చందా
౭ హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౪ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫-౪-౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions

Best Medium
for
Advertisement

*Volume* **15** **Hyderabad-Dn.** **Monday 26 August 1940** ***Number* 33**

## మెక్సికోలో ట్రాట్స్కీహత్య

### హంతకునిఅరెస్టు-రష్యాచారుడేమోయనుఅనుమానము

రష్యా కమ్యూనిస్టు నాయకులలో ప్రముఖుడును, లెనినుతోకలసి కమ్యూనిస్టు ప్రభుత్వమును రష్యాలో స్థాపించినవారిలో ముఖ్యుడును, ప్రస్తుతము స్టాలిను ఆగ్రహమునకు గురియై దేశమునుండి బహిష్కరింపబడి మెక్సికోలో నివాసమేర్పరచుకొని యున్నవారునగు ట్రాట్స్కీగారు ఫ్రాంకుజాన్సను అను ఫ్రాన్సు యూదుని విందునకు ఆహ్వానించిరి. విందునకువచ్చిన జాన్సను ట్రాట్స్కీగారివెనుకవైపునుండి సుత్తితో కొట్టెను. తలకు బలమగుదెబ్బలుతగిలినవి. కుడిభుజముమీదను మోకాళ్లమీదను దెబ్బలుతగిలినవి. అతనిని వైద్యశాలకుపంపిరి ట్రాట్స్కీగారి భటులు జాన్సనును పట్టుకొని స్పృహతప్పి క్రిందపడువరకు చావమోదిరి

జాన్సను ప్రస్తుతము పోలీసు నిర్బంధమునందున్నాడు. రెండునెలల క్రితము ట్రాట్స్కీని చంపుటకై ఒకప్రయత్నము జరిగినది. వందలకొలది తుపాకిగుండ్లు వీరున్నగదిలోనికి ప్రేల్చబడెను గానివీరికి అపాయముకలుగలేదు. అదిమొదలు మరల తనను చంపుటకై ప్రయత్నములు జరుగునని ట్రాట్స్కీగారు భయపడుచుండిరి.

ఆగస్టు ౨౧ వ తేది మధ్యాహ్నము వైద్యులు ట్రాట్స్కీగారికి శస్త్రచికిత్సజరిపిరి. రాత్రి యంతయు వైద్యులు ఇంజెక్షనులు ప్రాణవాయువునిచ్చి ప్రాణములను నిలిపిరి.

ఆగస్టు ౨౨ వ తేది సాయంకాలము ౭గం ౨౫ ని-లకు ట్రాట్స్కీగారు వైద్యశాలలో మరణించిరి. స్పృహతప్పిపోవుటకుముందు ట్రాట్స్కీగారిట్లు చెప్పిరి:

"రాజకీయహంతకులవల్ల నేను మరణించుచున్నాను. నామిత్రులందరు ఈ ఉద్యమమును సాగింపవలయుననియే కోరుచున్నాను. ఈ పర్యాయము రష్యాలో జరుగుఎన్నికలలో మనపక్షమునకే అఖండవిజయము కలుగునను పూర్తినమ్మకము నాకున్నది"

**హత్యోద్దేశము**

హత్యోద్దేశమునుగురించి హత్యాప్రయత్నమొనర్చిన ఫ్రాంకుజాన్సనుగారు యిట్లుచెప్పిరి:

"నేను ఒక బెల్జియం రాయబారికుమారుడను టెహరానులోనుండగ నేనుజన్మించితిని. ట్రాట్స్కీగారి సిద్ధాంతములపైనాకుచిన్నతనమునుండి అభిమానము, గౌరవము కలిగియుండెడిది. ఈకారణమువల్ల వారిని సందర్శించుటకు పారిసునుండి మెక్సికోకువచ్చితిని, కాని ట్రాట్స్కీతో పరిచయము కలిగినపిమ్మట వారియెడల పూజ్యభావము పూర్తిగనశించినది. వీరుజీవించియుండుట ప్రపంచమునకు అనర్థమనితలచి వీరిని చంపి ప్రపంచమును కాపాడ నేనుసంకల్పించుకొంటిని."

హత్యాప్రయత్నమునుగురించి ట్రాట్స్కీగారి భవనమునుండి ఈ క్రిందివివరములతో కూడిన ఒకప్రకటన గావింపబడినది:

ట్రాట్స్కీని చంపుటకై ప్రయత్నించినఫ్రాంకుజాన్సను రష్యారహస్యపు పోలీసుదళమగు "ఒగ్పు"ఏజెంటు. వీరుట్రాట్స్కీగారి ఉద్యమముపట్ల అభిమానము ప్రకటించుచు ట్రాట్స్కీగారిమైత్రిని సంపాదించిరి వీరు ట్రాట్స్కీఇంటికివచ్చి తానువ్రాసినవ్యాసమును ట్రాట్స్కీకి చదివి వినిపింప ఉద్దేశించినట్లుతెలిపిరి. అందుపై ట్రాట్స్కీగారితనిని తనగదిలోనికి తీసికొనిపోయిరి. మరుక్షణముననే జాన్సనుగారు సుత్తితో ట్రాట్స్కీగారితలపైకొట్టిరి. ట్రాట్స్కీగారి కేకలువిని ఇంటియందున్నవారు గదిలోనికివచ్చునప్పటికి రక్తప్రవాహముగకారుచుండ ట్రాట్స్కీగారు స్పృహతప్పిపడియుండిరి. రష్యాఅధికారులు తనతల్లిని ఖైదుచేసినట్లు జాన్సను చెప్పుచున్నాడు

మొదటిసోవియటుప్రభుత్వంన ట్రాట్స్కీవిదేశాంగశాఖామంత్రిగపనిచేసిరి.అటుపిమ్మట యుద్ధశాఖామంత్రిగ పనిచేసి సైనికశాఖానిర్మాణమునగొప్పకీర్తిప్రతిష్ఠలనుగావించిరి. కాని ౧౯౨౪ సంవత్సరమున లెనినుగారు మరణించగానే ప్రభుత్వమున వీరిపలుకుబడి తగ్గిపోయెను. అధికారమునకు వచ్చినస్టాలినుకు వీరికిని వైషమ్యము అధికమయ్యెను. రష్యాలో కమ్యూనిస్టుప్రభుత్వమును నిలుపవలెననిన చుట్టుప్రక్కలనున్న యితరరాజ్యములలోకూడ కమ్యూనిస్టు సిద్ధాంతములను వ్యాపింపజేసి వాటినికూడ కమ్యూనిస్టు రాజ్యములుగ మార్చవలయునని ట్రాట్స్కీగారివాదము. స్టాలినుగారు ఈవాదమును అంగీకరింపరు. ఇతరరాజ్యములు ఏవిధముగనున్నను రషియాబలమువిషయమై లోటులోనున్న రషియాలో సోవియటు పరిపాలననిలిచియుండుటకు ఆవాంతరముండదని స్టాలినుఅభిప్రాయము ఈ అభిప్రాయభేదములవల్ల తిగాదాలు అధికమై ౧౯౨౭ వ సంవత్సరమున ట్రాట్స్కీగారు వారిఅనుచరులు రష్యానుండి వెడలగొట్టబడిరి. అదిమొదలు వీరు ఐరోపాఖండములో కొంతకాలముండి తమప్రచారమును సాగించిరి. దాదాపు రెండుసంవత్సరములక్రితము వీరు మెక్సికోచేరిరి.

---

### బ్రిటనులోని జపాను పౌరుల స్వదేశ ప్రయాణము

టోకియో, ఆగస్టు ౨౦

ఇంగ్లాండులోనున్న జపాను పౌరులను ఇంగ్లాండునుండి జపానుకు తీసికొనిపోవుటకై జపాను ప్రభుత్వమువారు నాలుగు స్టీమర్లను పంపినారు. ఎట్టిఅపాయములేకుండ ఈస్టీమర్లు ప్రయాణమొనర్చుటకు సంరక్షణయొసగవలయునని కోరుచు జపానుప్రభుత్వము జర్మనీ ప్రభుత్వమునుకోరినది జర్మనీ ఆక్షేపసగినది. కానిప్రస్తుతము ౨౦౦ మందినిమాత్రమే పంపుచున్నారు.

**చంగుకింగుపై బాంబుల వర్షము**

ఆగస్టు ౧౯వ ౨౦వ తేదులలో జపాను వైమానికులు చంగుకింగుపై దాడివెడలి బాంబుల వర్షమును కురిపించిరి. బాంకీలు, ఫలహార విక్రయస్థలములములు, అంగళ్లుఉన్న ప్రదేశములో ఎక్కువభాగము ధ్వంసమైపోయినది. దెబ్బలుతగిలినవారిసంఖ్య మరణించినవారి సంఖ్య వేయికిపైబడియుండునని తోచుచున్నది.

**షాంఘాయి కాపలా**

షాంఘాయిలో ఇంతవరకు బ్రిటిషు సేనలకాపలాయందున్న ప్రదేశములలోని బ్రిటిషుసేనలు ఆగస్టు ౧౯వతేది రాత్రి తమస్థానములను వదలిరి

**జపానుకు బ్రిటిషు కిరసనాయిలు సప్లై**

లండను, ఆగస్టు ౨౧

బర్మారోడుమూయబడుటవల్ల యుద్ధసామగ్రి చైనాకు పోవుటలేదు కాని కడచిన ఏప్రెలు నెలలో ౧౦ లక్షల బారెలుల పెట్రోలియము సప్లైకి జపాను ప్రభుత్వమువారు ఆంగ్లోఇరేనియను ఆయిలు కంపెనివారితో ఒకఒప్పందము గావించుకొనిరి. ఈకంపెని వాటాలలో బ్రిటిషు ప్రభుత్వమునకే ఎక్కువవాటాలున్నవి. ఈకారణమువల్ల ఈఒప్పందమును రద్దుచేసి జపానుకు పెట్రోలియం సప్లయినాపవలయునని ఆగస్టు ౧౧వ తేది కామన్సు సభలో కొంతమంది సభ్యులుసూచించిరి

బట్లరుగారు ఈవిషయమై ఏప్రిలు ౨౯వతేదిన ప్రభుత్వ వైఖరిని పెట్రోలియం మంత్రిగారు ప్రకటించియున్నారనిరి.

మాండెలుగారు బర్మారోడుమూయబడుటచే చైనాకు పెట్రోలు సప్లయి నిరోధింపబడియుండ, జపానుకుమాత్రము మామూలుప్రకారము పెట్రోలు సప్లయి చేయబడుటకంటె అన్యాయము మరొకటియుండదనిరి అందుకు బట్లరుగారు ఈ కంపెనివర్తకపు ఏర్పాటులలో జోక్యముకలుగజేసికొనుట ప్రభుత్వవిధానముకాదని పెట్రోలు మంత్రి ఏప్రిలు ౨౯వతేదిన ఒకప్రకటన గావించి నసంగతి జ్ఞప్తి చేసిరి.

నోయిలు బేకరుగారు బ్రిటిషు ప్రభుత్వము దౌర్జన్యమునకు గురియైన రాజ్యమునకు సప్లయిలను నిరోధించుచు, దౌర్జన్యమునకు గడంగిన రాజ్యమునకు సమృద్ధిగ సప్లయి చేయుచున్నారని ఆక్షేపించుటకు అవకాశము ఇవ్వకుండుట భావ్యమని సూచించిరి. బట్లరుగారందుకు ఇట్టిఆక్షేపణకు అవకాశమివ్వకూడదనియే ప్రభుత్వమువారి ఉద్దేశ్యములు కానిఈవిషయమును కొన్ని ప్రత్యేకపు చిక్కులున్నవి. సభ్యులు తెలిపిన అభిప్రాయములను పెట్రోలుశాఖామంత్రికి తెలిపెదననిరి.

**ముస్లింలీగు కార్యవర్గ సమావేశము**

అఖిలభారత ముస్లింలీగు కార్యవర్గసమావేశము ఈఆగస్టునెల ౩౧వతేదినుంచి బొంబాయిలో జరుగును. ఆసమావేశమునందు ఇటీవలి వైస్రాయిప్రకటననుగూర్చియు, వలంటీర్లవిషయమై యున్నగువాటినిగురించియు చర్చజరుగును.



**జపాను విదేశాంగ విధానపు మార్పు**

వెంటనే టోకియోకు ప్రయాణముకావలయునని జపానువిదేశాంగ మంత్రి మాట్సుఓకాగారు ౪౦ విదేశరాజ్యములలోనున్న జపానురాయబారులకు ఆగస్టు౨౦వతేది తంతిద్వారా ఉత్తరవు లంపిరి. విదేశాంగ వ్యవహారములందు జపానుప్రభుత్వమువారు అనుసరింపదలచిన మార్పుల విషయమై ఈరాయబారులను పిలచుచున్నారనియు. రాయబారులబదిలీలు నూతన నియామకములు జరుగుననియు ఊహింపబడుచున్నది.

ఈక్రింది దేశములందున్న రాయబారులకు ఈఉత్తరువులు పంపబడినవి:— అమెరికా. రుర్కీ, చైనా. బ్రెజిలు, ఫ్రాన్సు (వీచి, స్పెయిను, కెనడా, ఇరాను, దక్షిణఆఫ్రికా. అఫ్గనిస్థానము, పెరు, హంగరి, అర్జెంటైనా. ఫిన్లాండు రుమేనియా. చీలి, కొలంబియా బెనిజాల, లట్వియా. ఈజిప్టు, పెనామ, బల్గేరియ, ఇరాకు,

**దక్షిణ సముద్రములలో జపాను విధానము**

దక్షిణసముద్ర ప్రాంతములలో జపాను ప్రభుత్వమువారు అనుసరింపతలచిన విధానమునకు కొన్ని ఐరోపారాజ్యములు అటంకములను కలుగచేయవచ్చుననియు. ఈ అటంకములనుపాటింపక జపాను ప్రభుత్వమువారు తమవిధానము ననుసరించి వ్యవహారములు జరిపెదరని ఆగస్టు ౨౨వతేది మాట్సుఓకాగారొక ప్రకటన గావించిరి.

**జపానులో ఒక్కపార్టీ**

జపాను శాసనసభయగు డయట్లో ఇదివరకున్న పార్టీలనన్నిటిని తీసివేసి ఒక్కటేపార్టీని ఏర్పాటుచేయు విషయమై ఆలోచనలు జరుగుచున్నవి ఇందుకై ౨౦మంది సభ్యులుగల ఒక కమిటీ ఏర్పాటుచేయబడినది.

## ఈజిప్టు నిశ్చయము

### ఆత్మసంరక్షణకై యుద్ధమునలుప వెనుదీయదు

**ఈజిప్టుపార్లమెంటులో ప్రధానిప్రకటన**

ఆగస్టు ౨౨వ తేది ఈజిప్టు పార్లమెంటు రహస్య సమావేశము జరిగినది, ఈజిప్టు శాంతిని కోరుచున్నదనియు, గాని ఇటలీ సేనలు ఈజిప్టుపై దాడివెడలిన, ఇటలీపై ఈజిప్టు ప్రభుత్వము యుద్ధముప్రకటించుననియు ప్రధానమంత్రిగారు ఒకప్రకటన గావించిరి. ఏరాజ్యమైనను ఈజిప్టునెదిరించిన ఆత్మసంరక్షణకేగాక బ్రిటను- ఈజిప్టు ఒడంబడికవల్ల ఏర్పడినబాధ్యతల ననుసరించి కూడ దౌర్జన్య కార్యమును ప్రతిఘటింపవలసియుండునని ప్రధానమంత్రిగారు చెప్పిరి.

ఈజిప్టువైఖరిని వివరించుచు ప్రధానమంత్రిగారు గావించిన ప్రకటనను ఆమోదించుచు కైరో పత్రికలు అభిప్రాయములను ప్రకటించినవి.

ఈజిప్టుసేసలిపుడు సరిహద్దులవద్ద సైనిక ప్రాముఖ్యముగల స్థానములను ఆక్రమించుకొనియున్నవి.

సూడెను సంరక్షణ కార్యములోకూడ ఈజిప్టుసేనలు ఆప్రాంతములందున్నవనియు, ఈజిప్టుసేనలు ఎదిరింపబడినచో యుద్ధముచేయక తప్పదనియు యుద్ధశాఖామంత్రిగారు చెప్పిరి.

ఫ్రెంచి విమానదళ సహాయము కోల్పోయినందువల్ల ఎక్కువ బల మొనర్చబడిన మధ్యప్రాచ్య బ్రిటిషు విమానదళము ఈ ఫ్రంటుపై ఇటలీ దండెత్తితే యుద్ధప్రక్రియలలో ఎక్కువగా పని చేయవలసియుండునని రూటరు వైమానిక విశేషజ్ఞులు తెలుపుచున్నారు

## శ్రీకృష్ణవిగ్రహ దర్శనం

హైదరాబాదు (దక్కను) ఆగస్టు౨౪

సుమారు ౨లక్షలు వ్యయపరచి చేయించి యంత్రయుక్తమైన సువర్ణరజిత శ్రీకృష్ణాదులవిగ్రహాల ప్రదర్శనము రాజా పన్నాలాల్ బన్సీలాలుగారియింటి (హైదరాబాదు బేగంబజారులో) బుధవారం కృష్ణాష్టమినాడు రాత్రి ౭ నుండి ౧౨ గంటలవరకు చూపబడును. హిందువులందరును చూడవచ్చును.

## మార్వాడి శవమునుగూర్చి జగడము

హైదరాబాదు(దక్కను) మెహరు౧౯ ౧౩౫౦ మెహర్ ౧౩౪౯ఫ, నాడు ఉదయము ౧౧గంటలకు హుసేనిఆలంవద్ద మారువాడివాండ్లుశవము తీసుకపోయేసమయమున మసీదువద్ద మహమ్మదీయుడు బాజావాయించువాండ్లపైనబడి కొట్టెను. కొందరికి గాయములుతగిలినవి, పోలీసువారు దవాఖానాలోచేర్చిరి ఈవిషయము విచారించగా మార్వాడీ ఆర్యసమాజమువారైనందున కొట్లాటజరిగినదని తెలిసినది. అతడు శవమును దారిలోదింపించి, వినాయకరావు, పన్నాలాలుగార్లువచ్చువంతవరకు శవముయొక్క కుటుంబమువారితో శవమును ముందుకుతీసుకపోకూడదనెను. ప్రజలు గుమిగూడిరి.

వెంటనే పోలీసుమదదుగారు, సదరుఅమీనుగార్లు వివాదమును సర్దిరి. మారువాడివాండ్లు శవమునుయెత్తుకొని పాతవారధి స్మశానమునకు తీసుకపోయిరి.

పోలీసువారు మహమ్మదీయునిపైనను మరియు ఉద్రేకముకలిగించిన మార్వాడిపైనను అభియోగము ఖాయపర్చుదురట.



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad-Dn Editor- S. Prathapa Reddy B. A. B. L